

శ్రీదక్షిణా మూర్తయేనమః

# పాంచాలీ పరిణయము.

396

(ఆరంకముల నాటకము)

అత్తిలి స్థానిక మధ్యమపాఠశాలాంధ్రోపాధ్యాయులగు

## అయ్యగారి వీరభద్రరావుగారిచే

రచియింపఁబడియె.








ప్రకాశకులు

## టి. వి. రమణయ్య అండు బ్రదర్సు

నేషనల్ బుక్కుడిపో, రాజమండ్రి.

కాపీరైటు రిజిష్టరుడు] 1926 [వెల రు 1—0—0

# పీఠిక.

చదువరులారా!

నేను నాటకము రచియించుట కిదియే ప్రథమయత్నము. నా శక్తికొలది యత్నించి పాత్రపోషణముంచి వ్రాసితి. వివిధగ్రంథరచనా దురంధరులగు కోవిదు లీగ్రంథమునగల దోషముల గృపతో నాకెరిగించిన ద్వితీయముద్రణమున సవరించుకొనిమెద.

ప్రదర్శకులారా! ఈనాటకము బన్నిద్దరుతో బ్రదర్శింపవచ్చునని నాయభిప్రాయము. ఇందు పాత్రము లెక్కువగానున్నవని చూడమానక నాద్యంతము జదువగోరితిని.

ఇట్లు

విద్వజ్జనవిధేయుఁడు,

అయ్యగారి వీరభద్రరావు.

అత్తిలి

1—1—26

## —* ఇందు వచ్చు పాత్రలు *—

### పురుషులు.

పాండవులు—కథానాయకులు.

శ్రీకృష్ణ బలరాములు—యాదవులు.

దృతరాష్ట్రుడు—కురుపతి.

దుర్యోధనుడు—ధృతరాష్ట్రుని పెద్దకొడుకు.

దుశ్శాసనుడు—దుర్యోధనుని తమ్ముడు.

కర్ణుడు—సూర్యపుత్రుడు.

శకుని—దుర్యోధనుని మేనమామ.

ద్రోణుడు—పాండవ కౌరవులగురువు.

భీష్ముడు—కౌరవ పాండవులతాత.

విదురుడు—శూద్రపుత్రుడు.

ద్రుపదుడు—పాంచాల దేశపురాజు

దృష్టద్యుమ్నుడు—ద్రుపదుని కుమారుడు.

మతిమంతుడు—ద్రుపదుని మంత్రి

మందపాలుడు—విదురుడు పంపిన దూత

హిడింబుడు, బకాసురుడు } రాక్షసులు

నాగింబొట్లు, లంబోదరుడు, కామశర్మ, సోమశర్మ, సోమయాజి } బ్రాహ్మణులు

ధర్మరతుడు—సోమయాజి కుమారుడు

శిశుపాల జరాసంధాదులు.

మరికొందరు వత్తురు

### స్త్రీలు

పాంచాలి—కథానాయిక.

కుంతి—పాండవులతల్లి.

భ్రమరిక—పాంచాలి చెలికత్తె.

హిడింబి—భీముని భార్య.

ధర్మశీల—సోమయాజి భార్య.

సుమతి—సోమయాజిసుత.

శ్రీదక్షిణామూర్తయే నమః

# పాంచాలిపరిణయము



[నాంది]

ఉ. శ్రీలలివక్షపీఠిక వసించెడు క్షీరపయోధికన్యతో
నేలనుబుట్టి దుష్టతతి నిర్దళనంబొనరించి సాధ్వి పాం
చాలికఁ బాండుపుత్రకుల భర్తలుగా నొనగూర్చినట్టి గో
పాలకుఁడైన కృష్ణుఁడు శుభంబుల సభ్యులకిచ్చి గావుతన్.

సూత్రి— (ప్రవేశించి పుష్పాంజలివిడి తనలో) సుధర్మానిభంబగు సభ జూడ నామనం బుత్సహించుచున్నది. వీరలకుఁ బ్రీతికరమైన యేనాటకమునైన బ్రదర్శించవలయు. ప్రేయసి యింకను రాలేదు. కతంబేమైయుండు (తెరవంకజూచి) కాంతా! నీసింగారము గట్టివెట్టి సత్వరమునరమ్ము. జాగగుచున్నది.

నటి—(ప్రవేశించి) నాథా! నన్ను బిలచిన కారణంబేమి?

సూత్రి—కాంతా! ఈసభ గాంచితివే.

నటి—నేత్రానందంబొదవ గనుఁగొంటిని.

సూత్రి—సభాసదుల మనంబున కమితానందంబొసగు నాటకమొకటి మనము ప్రదర్శింపవలయును.

నటి—ఆర్యాపుత్రా! సమయమునకు జ్ఞప్తికి వచ్చినది. మనముపాంచాలీపరిణయంబను నాటకంబునుబ్రదర్శింతెము. అయ్యది నవరసభరితమై యుండును కాని దాని నేకవీంద్రుఁడును రచియించియుండలేదని సందియము గలుగుచున్నయది.

**సూత్ర**—ఔను (ఆలోచించి) రచియించియుండ కేమి ? రచియించిరి-

**నటి**—ఎవరు రచించిరి ?

**సూత్ర**—

సీ. శ్రీవిభూతినిమించి చెన్నందు మిన్నంచి
లీపురంబాతని కాపురంబు
కౌండిన్యగోత్ర వి ఖ్యాతు డాపస్తంభ
సూత్రు డార్వేలప విత్రకులుఁడు
అయగారి వంశార్ణ వాబ్జుండు వీరయా
మాత్యపుంగవునకు పౌత్రుండు
నతిభక్తి సర్వేశు స్తుతిజేయు నల బాంప
మాంబికా వీరయా మాత్యసుతుఁడు

గీ. అత్రిపురి పాఠశాలలో నాంధ్రపండి
తుడయి యలరు సుకవనయు తుండు ఘనుఁడు
గానసాహిత్యములఁ గీర్తి గాంచినాడు
వీరభద్రకాయాఖ్యుండు వెలదివినుమ

ఆతనికవనము సహృదయరంజనముగా మృదుమధురశైలి దన
రారు; కాలయాపన మగుచున్నది. మనమరిగి యానాటకపాత్ర
ముల ధరింతము రమ్ము.

**నటి**—నడువుడు.

[ఇరువురు నిష్క్రమింతురు]

ఇది ప్రస్తావన.



శ్రీదక్షిణా మూర్తయేనమః

# పాంచాలీ పరిణయము



## ప్రథమాంకము

రంగము —లాక్షాగృహము.

[ప్రవేశము-ధర్మజ, భీమ, అర్జున, నకుల, సహదేవులు]

ధర్మ—సోదరులారా!

గీ॥ తెలివి యొక్కింతలేకయు ౘ దేజరిలిన
బలహీనతచే మేను ౘ పరిథవిలిన
గుణవిహీనత హెచ్చాయత ౘ గొమరుచున్న
కెంతయో ముద్దగు ౘ దనయుజూడ.

భీముడు—అగ్రజా!

ఆ. వె. దారిగొట్టుచుండు ౘ చోరుడైయుండిన
బుధులదిట్టుతాగ్రు ౘ బోతుయైన
చూడ చూడ మిగుల ౘ జూదగాడైనను
తండ్రి కెంతముద్దు ౘ తనయుజూడ.

అర్జున—అగ్రజులారా!

గీ. ఎంతయో రూపసద్గుణ ♯ వంతులైన
నితరబాలల సుతుకన్న ♯ నెవడు ప్రేమ
జూపు కాకము ♯ తనపిల్లజూచి మెచ్చు!
కీరమును మెచ్చఁగోవునే ♯ ధీరులార!

ధర్మజు——బాగు బాగు

భీము——సహోదరునిమతము సమంజసముగానున్నది

నకులు——అగ్రజులారా! మీరు నడిపినది నిక్కము

సహ——ఎంతనిక్కమైనను మనకు కొత్తయేమిగలదు?

ఆ. వె. ఘనుడు భీముజూచి ♯ కాలువీటికినంప
విషము నన్నమందు ♯ వెట్టియున్న
కోమరు నెడసియుండ ♯ దొడుగునే పెదతండ్రి
మనల నిటకు ♯ నిటుల బనిచినట్లు

అదిప్రేమకాదా!

భీము——సహోదరా! సహదేవా! నిజము నిజము బాగుగాపలికితివి. (జ్ఞాతిశ్ఛేదనలేనకిం) అను రీతిగా మనల సంహరించి సుఖంబున నుండజూచు కొమరునెటుల ధృతరాష్ట్రుడు ప్రేమించుచుండెనో మనము చూచుటలేదా?

ధర్మజు——సహోదరా! భీమసేనా! దుర్యోధనునివిషయమై పెదతండ్రినను టతప్పు

ఆ. వె. తండ్రిలేనిమనల ♯ తనయులరీతిగా
బెంచినాడు యశము ♯ గాంచినాడు
విద్యలెన్నియొ గర ♯ పించిన పెదతండ్రి
దూరుటొప్పుగాదు ♯ మారుతసుత!

భీము——ఔను అట్టివిద్యలవలననే మనమిట్లప్రియులమైతిమి.

సీ. ఆదిగౌరవుల నే నమ్మహా ॥ రుహామున
వంచించి పడద్రోయ ॥ టెంచనొకటి
గురుదక్షిణార్థమై ॥ యరగి ద్రుపదుబట్టి
ఫల్గుణుండే దెచ్చి ॥ వచ్చుటొకటి
లక్ష్యముంచిన పక్షి ॥ రయమునీదన్వి
భువిబడగొట్టుట ॥ బొల్పనొకటి
అస్త్రవిద్యల దన్వి ॥ యధిక కుశలుడగుట
ప్రజలు మనల మెచ్చి ॥ వరలుటొకటి
గీ. చీకురాజుమనసు ॥ చీకాకుగావించె
తనయులిట్లువిద్ద ॥ దనరుకుంట
కాన మనల నిట్లు ॥ పూనిపంపింపడే
దయ యొకింతలేక ॥ ధర్మరాజు.

అర్జు—నిజము అగ్రజులారా ! నాకొకసందియము మనమున గుందించుచున్నది. ఇంతగా మనల వేధించిన నాకౌరవులు మనల నిచ్చటనైన సౌఖ్యపెట్టునా ?

భీము—అది కలలోనిమాట.

నకులు—ఈసౌధంబుజూడ నాకు సందియమగుచున్నది. ఏమనిన నీగృహకుడ్యములు లాక్షాగర్భములు నాజ్యతైలగంధులుగానున్నవి. పరికించితిరే ?

సహ—అగ్రజులారా ! నకులవచనము లవశ్యము. నాలోచనీయంబులు

ధర్మ—సహోదరులారా ! మీవచనంబులు నిక్కము.

భీము—ఇప్పటికినైన మనసునకు దోచినదిగదా !

అర్జు—సకలధర్మపరిజ్ఞానియగు నగ్రజునకు తెలియనిహంసములు మనకు స్ఫురించునా ? సర్వము నాయనకే దెలియును.

ధర్మ—

చ. తెలియకగాదు కయ్యమున ǀ ధీరతలేకయుగాదు పావనీ!
ఖలుడు సుయోధనుండనుట కానన ǀ తండ్రి గతించినట్టి వా
రలముగదా! కసఱ మనల ǀ రమ్మని ప్రేమను మించె నీకు రా
జిల బుధులెల్ల మెచ్చరను ǀ సిగ్గున నైనను బెంచుచుండెగా.
ఆ. వె. పెద్దతండ్రిసుతుల ǀ బ్రియము జూడరుగదా
పాండుసుతులుజూడ ǀ బాడువడిరి
ధర్మమెన్నగలదె ǀ ధరణిలోననుచును
లోకులెల్లనగరె ǀ కాకులగతి.

అర్జు—అగ్రజా! మీరువచించినది నిక్కమే. అయినను మామతికి విషాన్నముపెట్టినను, పాములచేగరపించినను నిద్రితనీటద్రోయించినపుడును సుతు నాతడు మందలించెనా? లేదు. మఱియు అస్త్రశస్త్రకౌశలముజూపునాడు మదీయ ఘనసాయకకౌశలంబు జూచి బెగడొందుట యెఱుగమే? సుయోధనుండు కయ్యమున నన్నెల్చుజోడులేడని వగవసూతపుత్రకుం డరుదెంచ రాజ్యవిహీనులతో బోరుసలుప మనసుయోధనుండు వానికంగదేశమునిచ్చి నిలుప ధృతరాష్ట్రుండు సంతసమొందినట్లువిదురాదులవలనవినమే? తదానుగుణ్యములైన వారినడతల గనమే? హస్తిపురంబుననున్న మనల నిటకు బంపుటకు కారణంబుండుగాని యుండకతప్పదు.

సహదేవు—ఉండకేమి? భావికాలవిదుండగు విదురుండు మనమరుదెంచు సమయమున ధర్మనందను జేరి ధర్మనందనా! వారణావతమునకు మీరు వెడలుచుండిరి. మీపెదతండ్రి బంపుచుండెగాని ప్రేమ్మ చేతననిగాదు. దానికేదియో హేతువుండును. గాన నప్రమత్తులరై యుండుడని చెప్ప నాసంగతి మఱచితిరే?

భీము—నిజము. నిజము.

అర్జు—సహదేవా! మరచినసంగతి చక్కగా జ్ఞప్తికిదెచ్చితివి.

ధర్మ—సహోదరులారా!

ఆ. వె. తండ్రిలేకయుండి ౯ తల్లడిల్లు మనల
గాసివెట్టుజూచు ౯ గౌరవులహ
గోరుచుట్టుపైన ౯ గొమరు రోకటిపోటు
చందమయ్యె మనల ౯ డెందములకు

భీము—అగ్రజా! తండ్రిలేనికొరత మనల బాధించనోపు

అర్జు-

ఉ. బాపురె! యెంతవచ్చె మన ౯ పాపపురోజులుగావె లేనిచో
భూపతిపుంగవుం డమితిపూజిత ౯ సచ్చరితాత్మ తండ్రినే
బాపిగొనంగజాలితిమి ౯ భవ్యులు ప్రేమను జూతురిద్దరిన్
పాపులకిష్టమౌనె మన ౯ పల్కులు ధర్మములోల్కుచుండినన్

ఎట్లనిన

ఆ. చిలుకచెప్పుపల్కు ౯ చెవులబెట్టునె పిల్లి
పొట్టవెట్టుకొనగ ౯ బోవుగాని
ధర్మవిధముజెప్ప దాల్చునే ౯ చెవిలోన
పాపితనదుదారి ౯ నోవుగాని

అటులనే విదురభీష్మాదు లెన్నినీతులు దుర్యోధనునకు జెప్పినను బూడిద బోసిన పన్నీరువిధమయ్యె

ధర్మ—తమ్ములారా!

ఆ. వె. ఇతడు హితుడు మనల ౯ కత డహితుండును
టొప్పగాదు చూడ ౯ నప్పరుండు
సర్వదేహములను ౯ సంచరించుచునుండు
మనకు కర్మగాని ౯ మారుగలదె?

అలుగుకోదండనిష్క్రాంతంబైన. వెనుకప్రక్కనుండు విలుకాని

విధముగా పరాత్పరుండుండి తద్దోషంబు లేక జెందకుండ నితరుల జెందునట్లొనరించుచుండు కాని, మన మేగతినుందుమా? యని సందియము మనమును సందడింపజేయుచున్నది. ఆహా! జనని మనతోనున్నది కటకటా! నీపె నెటుల సహించగలదో? కట కటా! సుకుమారులు సోదరులు మీరలెట్లు కట్టిడుములు గుడువ వలసియుండిరో?

భీము—వశమున కేమున్నది నన్నువదలుము విధిపేర్చినతుండగు నాగ్రము క్కడిదుర్యోధను శిరము వ్రక్కలి చివచ్చెద(అనియరుగుచుండ)

[ తెరలో ]

రణాధీరయశోవిశాలనామా! భీమసేనా ! ఇది యదను గాదుడుగు ముడుగుము

అర్జ—అవి తల్లిగారి వచనములవలె నుండె. ఉయ్యావి ఆచరణీయములు

ధర్మ—ఔనునౌను.

నహ—మన కిప్పుడింత తొందరయేల?

ఆ. వె. కంటిరెప్పవోలి కాచు జీవులనెల్ల
సకలజీవులందు సంచరించు
నెవ్వడట్టి కృష్ణు డీశుడు మనపాల
గలడు చింతనొంద వలెనె మనము

ధర్మ—నిజము-ఆధ్వనియేమి!

అందరు—(ఆలకింతురు)

[ తెరలో ]

సకలకల్యాణగుణధన్యులగు పాండవేయు లెచ్చటనున్నవారు ఏమనుచుంటివి లాక్షాగృహంబున కాలివుండిరనుచుంటివా! బాగుబాగు!

నకులు—(తనలో) ఈతడెవ్వడైయుండునోగదా!

ధర్మ—(తనలో) ఈతఁడు కరిపురమునుండి యరుగుదెంచిన చారుఁడై యుండునని దోఁచు—

అర్జు—(తనలో) మేనమరదియగు శ్రీకృష్ణురాక దెల్పుచారుఁడా !

భీము—(తనలో)దుర్యోధనుడుమాంగాసినరసివచ్చుటకంపినదూతయేమో

మందపాలుఁడు—(ప్రవేశించి తనలో) కటకటా ! నిష్కారణవైరంబు నూని దుర్యోధనుఁ డెంతతలచె పాపము వీరలెట్టియిడుముల బడుదురోగదా ! (ప్రకాశముగా) అయ్యా ! పాండవేయులారా ! జయము. జయము.

ధర్మ—మందపాలా ! శుభమగుగాక-

అందరు—మందపాలుడా ! ఎచ్చటనుండి యరుదెంచితివి. క్షేమమా !

మంద—దేవా ! క్షేమము.

ధర్మ—

ఉ. మమే పెద్దతండ్రికి న శేషసుహృజ్జన పండితాళికిన్
సేమమె ద్రోణభీష్ములకు స్త్రీలకుకౌరవసంతుకంతకున్
క్షమమె వృద్ధులున్ విదుర సేముషికిన్నృపసూతికిన్ప్రజ
క్షేమమె ? నిర్విచారులె విశేషము లెవ్వియొ దెల్పగోరెదన్.

భీము—పాపీ ! చిరాయుః సుకృతీగతాయుః క్షేమమున కేమిగాని మందపాలా ! నాప్రశ్నమున కుత్తరమిమ్ము.

ఆ. వె. విషమునన్నముందు వెట్టుటయేకాక
మున్న జేసిన కృతు లెన్నొగలవు
కాని మరల మమ్ము కట్టిడుములుబెట్ట
నుండెనేమొగా సు యోధనుండు.

సహ—మందపాలా ! మాభీమన్నగారిప్రశ్న ముందుజెప్పుము.

అర్జు—మందపాలా ! నీరాకజూడ నాకు సంతసమొందుచున్నది. నిన్ను విదురుండుమాపాలికి బంపినట్లు తోఁచుచున్నది.

మందపాలు—దేవా! పాండవోత్తములారా! నేవిదురపంపున మీసన్నిధికి నిగూఢమున వచ్చితి. అందరకు క్షేమము.

భీము—నే తొలుతనే చెప్పియుంటిని. నీవట్లు నిగూఢంబుగా రాకతం కేమి?

అర్జు—(తనలో) కష్టా! ఇది యేదియో ముప్పు గాదోచుచున్నది.

ధర్మ—మందపాలా! విదురు డేమని జెప్పినాఁడె?

మందపాలు—దేవా! మాన్యపాలుఁడు నీరీతి దెల్పుమనియె, ఈకృష్ణచతుర్దశినాటిరేయి దుర్యోధన దుస్తంత్రమున పురోచనుఁడీలాక్షాగృహమున కగ్గిదగుల్చునని గావున మీరలాపీతి హానినివారణఁడి దప్పించుటకు సొరంగము బొరిదాని నిర్మించిమ్మని బుత్తెంచ వచ్చితిఁగావున నీపనిని రహస్యముగా నుంచుమనియె.

ధర్మ—కటకటా! యెంతటి మాట వింటిమి!

అర్జు—ఇల్లు గాల్చుటకే మనలనిటకుఁ బంపియుండెఁ గాబోలు మేలొనర్చుటకా!

భీము—(సక్రోధముగ) ఓరోరీ! కులపాంసనా! కఠోరపాషాణనిర్జితహృదయా! దుర్యోధనా! ఎంతతలంపు దలంచితివిగా!

చ. ఎరుగవ భీముదోర్బలము నింతదలంచి విరిమూర్ఖుఁడ
ధరణిని పాండునందనుల దర్పము డింపఁ దలంచు దుష్ట! నీ
శిరమును వ్రక్కలింతు నిక సిద్ధము పద్మభవాద్యవార్యతీ
వరు లరుదెంచి నిల్చినన వారితశౌర్యము జూపుమింతటన్.

అగ్రజా! నన్ను వదలుము నిముషమున నాసుయోధనుని గర్వము మాపి నిష్కంటక మొనరించి వచ్చెద.

అర్జు—అగ్రజా! నీవిట్లు గడంగుట దోషము. కష్టమునొందఁగ వారలెన్నటికి జెడువారలే? రహస్యముగా జేసిన దుస్తంత్రము మనమిట్లు బట్టబయలు జేసి నిర్నిమిత్తవైరంబున దుర్యోధనుని మడియించితిమని లోకులు నవ్వరే? బుధులు దిట్టరే! సమయము వచ్చుదనుక నోర్చియుండుట ముఖ్యము. నీవిట్టులాతురపడ దొప్పునే?

ధర్మ—భీమసేనా! ఇది తరుణముగాదు. మందపాలునిబంపిన విదురుడు నిష్కారణముగా నిందులకు ముఖ్యకారకుడని జననిందకు మనమే హేతుభూతుల మగుదుము కావున ముందు జరుగనున్న సంగతి విచారింతము.

మంద—పాండవోత్తములారా! ధర్మాధర్మవిచారదక్షులు తమబోంట్లీవిధమునవాగ్రహమొందిన కార్యములు చక్కబడుటెట్లు? తమకొఱకై నైఋత్యమున సొరంగము నిర్మించివత్తును.

ధర్మ—మంచిది- పోయిరమ్ము.

భీము—ఏనాటికి దుర్యోధనునితో సమరంబు సిద్ధించునో! ఏనాడు మదీయ దర్పముచూపి వానినంతమొందింతునోగదా?

అర్జు—ఇంతవరకు రక్షించుచున్న భగవంతుడే నీకోర్కె కొలదిదినంబులకు సిద్ధింపజేయు.

ధర్మ—సహోదరులారా! భావికాలకర్తవ్యమున కేమిగాని ప్రస్తుతాంశమును పరికింపుడు.

భీము—విచారించుట కేమియులేదు!

అర్జు—సొరంగమును మందపాలుండు నిర్మించును. పురోచనుడగ్నిదగుల్చుతరి మనమాసొరంగమునుండి యరణ్యమున కరుగగలము.

నకు—భీమార్జునసకులసహదేవులారా! మనమాసొరంగమునుండి బోవుటెట్లు? మహాసుకుమారియగు మాతతో నెట్లు వనిచరింతుము? ఏమియు దోచకున్నది.

భీము—తలంచుటకిం దేమియులేదు- పురోచనుడు నిప్పు తగిలించకముందే మనమీసొరంగమునుండి తప్పిచనుచు వాడొనర్చుకృత్యము మనమొనరగన బకధ్యానముసేయుచు తరుణమునకై వేచియుండిన నప్పురోచనుడనలమున మ్రగ్గగలడు.

అర్జు—ఈసందర్భమున విచారింతము కాని మనమందర మాసారంగము న బోవుటెట్లు?

భీము—అగ్రజా! సహోదరులారా! మదవేదండశుండావిభ భుజదండ మండితుండగు భీముఁడుండ మీావిచారమేల? నిముసంబున నందరి నొక్కపెట్టున భుజముపై వెట్టుకొని రక్షించెద.

ధర్మ—(తనలో)

సీ. శశికాంతశిలలపైఁ ♯ సంచరించెడు మాత
కంటకాన్వితభూమి ♯ గదలగలదె
దాసదాసీజన ♯ తతులమధ్య దిరుగు
మాత విపినములలో ♯ మసలగలదె
హంసతూలికపాన్పు ♯ నందు బండెడుమాత
మించి నేలపయి ♯ నిద్రించగలదె
షడ్రసయుతముగా ♯ సదతంబు భుజియించు
జెలువ దుంపలను ♯ భుజింపగలదె

గీ. అయ్యయో సుకుమారులీ ♯ యనుజులెల్ల
నెట్లు చరియింతురో వని ♯ నెరుగవశమె
కాల మెవ్వరికినయిన ♯ గడువ వశమె
అయిన మముబోలు ♯ నిర్భాగ్యు లవని గలరె?

మంద—(ప్రవేశించి) దేవా! సర్వము సిద్ధముజేసి వచ్చితి.

భీము—బాగు బాగు బాగు.

ధర్మ—ఈసంగతి మాతతో నాలోచింతము రండు.

అందరు—చిత్తము.

[నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.



శ్రీదక్షిణామూర్తయేనమః

# పాంచాలీపరిణయము



## ద్వితీయాంకము

రంగము—అరణ్యము

[ నిద్రితులై ధర్మార్జున నకులసహదేవులు! గుంతియు సంచరించుచు భీముడును-]

భీము—వీరలు నిద్రించుచుండిరి ఇది ఘోరారణ్యము భీకరమృగములు పెక్కులు గలవు వానిభయములేకుండ నేనిట నిద్రించక వీరల రక్షించుచుండెద (ఆలోచించి) బాగు! బాగు! కౌరవులుజేయించు కృత్యము ముందుగ నేనేనొసర్చితి మందపాలుడు తదనంతరము నాబిలద్వారంబు గప్పెనని జెప్పె ఇందువలన పాండవుల నిష్కారణము లక్కయింటబెట్టి చంపించిరను దుర్యశము కౌరవులకు రాకపోదు.

(హిడింబి—(ప్రవేశించి-తనలో)ఆహా! యేమి యీయౌవ్వనునిరూపము

సీ॥ శ్రీకారములనిమించు ॰ చెవిదోయిగలవాడు
కూర్మిమీరెడు ॰ సోగకురులవాడు
చారునీరజనిభ ॰ చక్షుర్ద్వయమువాడు
చంపకతుల్య ॰ నాసంబువాడు

కారుమబ్బులనొప్పు ẟ గేరుదేహమువాఁడు
ఘనమగు వెడద ẟ వక్షంబువాఁడు
నూఁగుమీసముతోడ ẟ నూఁగుగుల్లైవాఁడు
ఆజానుబాహువు ẟ లమరువాఁడు
గీ. సవర భీముండనఁగ ẟ నొప్పుజాలువాఁడు
ఘనశరీరముతోడుత ẟ గ్రాలువాఁడు
కనులపండువుగాఁగ ẟ నేఁగంటినేను
దనురాల నీతఁడె నాకు ẟ తగినజోడు.

ఈతం డెవ్వఁడో మహానుభావుండు పరోపకారార్థంబు తననిద్రవిడచి వారల రక్షించుచుండె. అన్న వీరలఁ జంపి దెమ్మని బుత్తెంచె నాకీ తని ప్రాణవిభునిగా నొనంచుకొనవలయు, నాకీతనిపొత్తు లభించిన నేమికావలయు కాంచనంబిలనెత్తావిసగనుటగాదె” యనుట నాకు లభించదా!

భీము—(పరికించి-తనలో) అర్ధరాత్రిసమయంబున నిమ్మించుబోఁడి యొక్కరిత యొంటరిగా సంచరింప గతం బేమి?

క. రతియో! శచీసతియొ భా
రతియో! మాసతియొ ẟ శివయొపమణీమణినా
మతిసందియంబునొందెను.
కతమేమొసరయ ẟ వలయుగాఁదెలుపఁగన్

(ప్రకాశముగా) ఓయన్నమిన్నా! ఒంటరిగా నీకంటకమ్మగవంత దురంతకాననము జరియించుచుంటివి కతంబేమి?

ఉ. ఎవ్వరిదానవీవు విభు ẟ డెవ్వఁడు కాపురమెద్ది కన్న
వా రెవ్వరు నామమెద్ది ẟ వనినిట్టులద్రిమ్మరనేలజెప్పు
జవ్వని నిన్నుజూడ సురచారణ ẟ కన్నెలలోనిదానవో
యివ్వనదేవివోయనఁగ ẟ నెంచితి మానసమందుజూడఁగన్

హిడింబి—ఆర్యపుత్రా! నావచనంబులువినుఁడు వనపాలించు హిడింబాసుర చెలియల పేరుహిడింబి. మదగ్రజుండు చిరకాలంబున కీవని మనుజసంచారము సంభవించినది గావున వారల నే పడచి భక్ష్యముల నొనర్పుమన నరుదెంచి నీరూపసౌందర్యములనారసి పంచశరునిశరాళికి నోడినీ—బరిణయమాడ నెంచితి.

భీము—ఓహో! హిడింబాసురుని చెలియలవా! బాగు బాగు చిరకాలంబునుండియుపోరాటమునకు దగిన సమయము జూచుచుంటి నేడు నా బుణ్యదినము

హిడింబి—ఆర్యపుత్రా! శరణాగతరక్షణ బిరుదాంకుడవగు నీకు స్త్రీవధ యుక్తంబె! అందు నిన్నువలచి వచ్చినకాంతను సంహరింపదగునా

భీము—అసురకాంతవైన నిన్ను నే వలచుటేడ? చాలుచాలు– నీప్రలాపంబుల గట్టిపెట్టి నీసదనంబునకరిగిన నరుగుము. లేకున్న నాము ష్టిఘాతంబున నాయమసదనమున కంపెదను.

హిడిం—అయ్యా! నన్ననుగ్రహించి నీజాయగా జేకొనుము.

భీము—ఓహో! పిశితాశనీ! నీమాయలు తేట తెల్లమైనవి. కదనంబున నన్ను గెలువశక్తిలేక మాయచే మమ్ముల బొలయించి నీయగ్రజుగోర్కె దీర్పనెంచితివా? నిలు నిలు.

[తెరలో]

ఓసీ! భ్రాతృఘాతకురాలా! తడవుచేసితివా? తుచ్ఛమానవుల సాంగత్యముగోరితివా?

[కలకలము వినబడును.]

హిడిం—ఆర్యపుత్రా! జాగగుటకు నాయగ్రజుండు కోపించి రూక్షాన లలోచనుండై వచ్చుచుండె– నావిన్నపమాలించి నన్ను రక్షించి దుష్టబాధ మాన్పుము.

భీము—కాంతా! వేయిమాటలేల? అగ్రజానుజులను, మాతను వద్ద

అసురకాంతనుగోరి సుఖించుట పాతకహేతువుకదా! కావున నీ యగ్రజుని జేరబొమ్ము- నీప్రాణంబుల రక్షించుకొనుము.

హిడిం—అయ్యా! కామరూపిణిని- మిమ్ముల నెచ్చటకువలసిన నచ్చటకు నిముసంబున జేరగలదానను.

గీ. క్రూరమారునిబాధ వేసారుచుంటి
కోర్కె దీర్పుము వేడెద కువలయేశ!
వేగగాంధర్వమున నను బెండ్లియాడి
నామనోశాంతి నిమ్మిక నానాగుణాఢ్య!

భీము—ఆ. వె. అసురకాంతనేను నన్ని నదులు పెండ్లి
యాడు బేడ చాలు నరుగుమింక
వేయిమాటలేల వినినవారు నగరె
మారుపలుకకుండ మరలుమింక.

[తెరలో కలకలము వినబడును]

హిడింబి—ఆర్యపుత్రా! మదగ్రజుడు ఘోరాకారంబున వచ్చుచున్నవాడు ఈవనమునుజొచ్చి వెలువడుట జమునికుక్షిజొచ్చి వెలువడినట్లు వీరితోడిదేమి నీవు నాకుం బతివై ప్రాణంబుల రక్షించుకొని నావలని నిష్కాభావంబుల పొందుము. నేను కామసంచారిణిని నీకిష్టంబైనచోటికి నిన్ను దోడ్కొనిపోగలను.

భీము—ఆ. వె. తనదు పురుషగుణము తగ్గయుసెడి తల్లి
తోడబుట్టువారి వీడి చపల
కాంతసుఖమునందు ఖలునతియుండునే
వినుతసుగుణశీల వినుము బేల!

హిడిం—(తనలో) ఈతనిమనంబు నెట్టులనైన గరగించి నామనోరథంబు నెరవేర్చుకొనవలయు.

ఆ. వె. తల్లిదండ్రులేల ॥ తమ్ముల నన్నల
తోడబుట్టువారి ॥ జూడనేల
ఇట్టివన్నెకాని. ॥ బట్టియుండకయున్న
వనిత తరుణమేల ॥ బ్రతుకనేల?

(ప్రకాశముగా) ఆర్యపుత్రా! వీరిని రక్షించుట నీకు బ్రియంబేని యిపుడే యాపురుషాదుఁడు రాకుండ ముందర వీరలనెత్తికొని పోయెద. సత్వర వీరలబోధింపుము.

క. వీరుడు రక్కసుడిట కరు
దేరుననుచు బ్రాణ ॥ భీతి దీనతబడి నే
బారుదునే ? సుఖనిద్రితు
లీరిని మేల్కొల్పదగునె ॥ యింతిరో జెపుమా !

గీ. కడగి రక్కసుడొక్కండు ॥ కాదు సురలు
నసుడు లేకమైనచ్చుట ॥ లైనగాని
చూడు వీరలమేల్కొల్ప ॥ వాడనేమొ
కలన వారలపోలయింతు ॥ గానితరుణి.

[తెరలో]

ఉ ఎవ్వడవోరి ? మందమతి ఇవ్వని ॥ జేరితివర్ధరాత్రి నీ
క్రొవ్వునడంతు నిల్వుమిక గూరత ॥ జెల్లలగాచువాడవా
చివ్వకురమ్ము నీబ్రతుకు ॥ చెల్లెనటంచును నెంచుకొమ్ము నా
కివ్వని నెంతకాలమున ॥ కిట్టుల మానవమాంసవచ్చెగా !

చ. సరసిజసంభవాది సురసంఘము ॥ నన్వినభీతినొందరే
నరుడవు నాదుచెంతను ॥ దృణంబునకై ననుబోలబోవు నీ
గరువముగాదె నిల్చుటిట ॥ కాలునిపీటికి నీక్షణంబే మి
మ్మరుగగజేతు కాచికొను ॥ మా వినుమా గనుమా నరాధమా.

హిడిం—నాయగ్రజుఁడు నిర్వక్రపరాక్రమయుక్తుఁడు. నన్నాతనిబారి నుండి కృపామతి రక్షింపుము.

భీము—ఓయసురతరుణీ ! నీ విటనిల్చి యుష్మదగ్రజుని యొక్కయు, నాయొక్క భుజబలంబుల నీక్షించుము.

హిడింబుఁడు—(ప్రవేశించి పై పద్యములను జదువును.)

భీము—నిశాచరాధమా ! కారులు ప్రేలి మత్సహోదరాదుల నిద్రా భంగ మొనర్పకుము. ఆప్రాంతమున కేగుదము రమ్ము.

హిడింబు—నరాధమా ! నీ ధైర్యముజూడ చిత్రమయ్యె.

ఆ. వె. నాదురాకఁగనిన ✻ నాళీకగర్భాది
సరలుభీతినొంది ✻ పరువులిడుదు
రహహా ! నరుఁడవెన్న ✻ నంగుళప్రాయుఁడ
వార ! నన్నెదిర్ప ✻ వచ్చుటేఁడ!

మదీయభుజబలంబు నీ వెఱుగవు గనుకనే యిచ్చట కర్ధరాత్రమునవచ్చితివి.

భీము—నక్తంచరాధమా! నీనామమువినియే వచ్చితి. ఉత్తమక్షత్రియ వంశజాతుఁడగు పాండుభూపాలవరేణ్య ద్వితీయపుత్రుఁడనగు నాభుజబలము నీ వెఱుంగవు. ఎఱిఁగినచో నిట్లువత్తువా ? వచ్చియు నిటు మాటాడుదువా ? కాలయాపన మేలజేసెదవు. సమరమునకు సత్వరముగ రమ్ము.

ఆ. వె. పట్టితినుటకిద్ది ✻ పశునికరముగాదు
కడగిపాఱఁజేయ ✻ గ్రతువుగాదు
భీతినొందజేయ ✻ భీరువుఁడనఁగాను
కలనిన్నుజంప ✻ కాలుఁడఁజుమ !

హిడింబు—ఓరోరి! నరాధమా! కారులు పెక్కులరచుచుంటివి. నీతుళ్ళింత మచ్చమాపెద. జెచ్చెర సమరమునకురమ్ము.

భీము—పాతకీ! రమ్ము.

[ఇరువురు నిష్క్రమింతురు]

కుంతి—(మేల్కొని-తనలో) ఏమి! ఈవింత? ఏమి యీరోదన! ఏమి ఈ దిశాక్రందనము? ఎవ్వరీసుందరవనిత? ఆహా! ఇదికలయా! నిక్కమా!

ధర్మ—(మేల్కొని తనలో) ఔరా! ఏమి ఈకలకలధ్వని! ఎవ్వరీసుందర వనిత? సహోదరుడు భీముడేడీ?

అర్జు—(మేల్కొని తనలో) ఇదికలయా నిక్కమా? భీముండేడీ? ఔరా! ఇది రాక్షసమాయయా!

నకు—(మేల్కొని తనలో) ఏమి? ఈవిపరీతము. ఆధ్వనియేదియో?

సహ—(మేల్కొని తనలో) ఇదియేదియో ప్రళయకాలవిధమున దోచు చున్నది.

కుంతి—అమ్మా! నీవెవ్వరవు? ఈయర్ధరాత్రిసమయమున నిచ్చటకు రాకకుంబేమి! నాకుమారుడు భీముడేడీ?

ధర్మ—తరుణిమణీ! సురవిద్యాధరగంధర్వాప్సరసకన్యకలలో నెవ్వరిదా నవు? నాసహోదరుడు భీముడేడి?

అర్జు—(తనలో) ఈమె వనదేవతయేమో?

సహ—(తనలో) కామరూపిణియగు రాక్షసాంగనయోమో?

హిడింబి—అవ్వా! ఈవనమును పాలించు హిడింబాసురుని చెలియల- నేను హిడింబి. అగ్రజానుజ్ఞాతనై మిమ్ములనందర మ్రింగవచ్చి నీసుతుంగని బలిబుద్ధిదాల్చి యున్నతమన్మథార్తినై మసలుచుం డ మదగ్రజుడు క్రోధమానసుండై తడవగుటకు మనలనందరి నొ క్కట మ్రింగ యత్నించి వచ్చుచుండ రణభీమసన్నిభుండగు నీసు తుం డాతనితో నల్లదె మల్లయుద్ధము సలుపుచుండె.

అర్జు—(ఆతురతతో) ఆహా! యెంతపనిజరిగినది? నకులసహదేవులాలా! రండు భీమునకు తోడ్పడుదము.

[నకులసహదేవార్జునులు నిష్క్రమింతురు]

[తెరలో]

ఆ. వె. అసురసంఘమైన ♯ నవలీల మడియింతు
నమరులడ్డమైన ♯ నడరువాడ
గాను రమ్ము రమ్ము ♯ కాలునివీటికి
బంపువాడ నిన్ను ♯ బలముజూపి.

ధర్మ—ఆహా! భీముఁ డాగ్రహాయత్తచిత్తుండయి నిశాచరువక్షంబు నెట్లు వృక్షంబులనెత్తి మోదుచున్నవాడు.

కుంతి—ముక్కిడిరక్కసుండట్టి పోకనెట్లు విజృంభించి వచ్చుచున్నవాడో ఆహా! ఎంతభీకరాకారుడు.

ధర్మ—అమ్మా!

ఆ. వె. కౌరవులొనరించు ♯ కార్యములకుబాసి
వనముజొచ్చియున్న ♯ మనకు నిడుము
లెట్లు వచ్చుచుండె ♯ నెంచగ కర్మంబు
దాటవశమె? భువిని ♯ విధాతకైన.

కుంతి—నాయనా! ధర్మరాజా! ఏదియో మరల ధ్వని వినవచ్చుచున్నది

[తెరలో]

ఉ. ఎందరిజూచినాడ భువినెందరితో ♯ ననిసల్పినాడ నే
నెందరిభీతిగొల్పితిని ఎందరి ♯ పొట్టనువెట్టుకొంటిగా
మందమనీషినై యశము ♯ మంటిని గల్పితి వీనిచేతిలో
మ్రిందగ ధాతనానుదుటవ్రాసె ♯ నొకోనరుచేత జిక్కితిన్.

ధర్మ—ఓహో! జననీ! చూచితివా! నిశాచరుండు భీమునిక్రింద నెట్లు చిక్కువడినాడో!

కుంతి—(చూచుచు) అమ్మయ్యో ! భీకరాకారుండై పైకిలేవనుంకించు నానిశాచరుపాదముల భీముండు గిరగిరద్రిప్పి నేలవైవ కందుకము భంగి పైకి మెట్లులేచుచున్నాడో !

హిడింబి—(తనలో) ఏమి! ఈభీమసేనుని పరాక్రమవిక్రమంబు.

[తెరలో]

హా ! చచ్చితి చచ్చితి. (పెద్దయార్పు వినబడును.)

ధర్మజు—అమ్మా ! మన మెంతధన్యులము. రక్కసునుక్కడించి భీముడిటు వచ్చుచున్నాడు.

కుంతి—ఎంతప్రమాదముదప్పినది? (పరికించి చిరునవ్వునవ్వుచు) భీముడు గతాసువైన నిశాచరునికోలెమ్ముల భల్లునివిఱచి నడుముద్రెంచి వచ్చుచున్నవాడు.

హిడింబి—(తనలో) వీరలు నామనోరథమున కిచ్చగింతురోలేదోకదా!

ఆ. వె. అసురకాంతననుచు ॥ ననుకంపజూపక
అన్న తెరవుజూడ ॥ నన్నుబంపు
నేమొ? దయనువిడచు ॥ నేమొగా నాకోర్కె
దీర్పకుండనిటుల ॥ దిరుగుమనుచు.

ఏమికానున్నదోగదా !

సీ. మోహనాకారుని ॥ మోదమొదంగ బిగిఁ
గౌఁగలించకయున్న ॥ ఘనతయేల?
పున్నాగసౌగంధ ॥ పుష్పహారములేల?
వనవిహారమురలేల ॥ బ్రతుకదేల?
త్రోడ్డవారలదేల? ॥ తోడబుట్టువులేల?
తలిదండ్రులింకేల ॥ తనవిదేల;
కల్యాణిమాసతి ॥ కాపురమైయున్న
కాపురంబికనేల? ॥ జ్ఞానమేల?

గీ. మలయమారుత ధాటికు న్నిలువజాల
విపులకీరవాణులనింక విననగపాల
కరుణసారంగధరనన్ను గావవేల
భైరవిప్రియ ప్రియుఁగూర్ప పంతమేల?

నామనోరథంబాతఁడు దీర్పకున్న

ఆ. వె. ప్రియునిచేతఁజావు ప్రియముకాదె? తలప
మాన్యచరితయైన మగువకెపుడు
కులముతోడనేమి గుణముప్రధానమ్ము
ధరణినెంచిచూడ తెరవకెన్న.

(ఆలోచించి) ఏమియైననుసరే?

ఆ. వె. మనసుకర్మవాక్కులను మానసముపెద్ద
మనసుగొన్నవిభుని మానదగునె
సర్వమెడసియున్న చావుచేకూరిన
మానవతికిమారు మనువుగలదె?

ఎట్టులైన నేడు సుదినముగదా! నామనవి నాతండంగీకరింపక ద్రోచివైచి నన్ను మడియింపనెంచినను-

ఆ. వె. విభునిజేత మరణ వైభవమునన్న
వైభవంబుగలదె వసుధనెన్న
నన్నుజాయరీతి మన్నించిననుమేలె
చంపనున్నమేలె సాధ్విఁగాన.

[తెరలో]

సహోదరులారా! రండు మనకై యాగ్రజుడును, మాతయు వేచియుందురు.

ధర్మ—(తనలో) రణస్థలభీమా ! నీపరాక్రమము వర్ణనాతీతముకదా
[భీమార్జున నకుల సహదేవులు ప్రవేశము.]

భీము—అగ్రజా ! వందనములు.

ధర్మ—తమ్ముడా ! చిరంజీవివై యశేషభూభువనంబున విశేషయశంబార్జింతువుగాక !

భీము—తల్లీ ! నమస్కారములు.

కుంతి—కుమారా ! సత్కీర్తిచంద్రికలు జగత్తుననింపి వర్ధిల్లుదువుగాక !

భీము—ఓ దైత్యతరుణీ ! నీవిటజాగుసేయక నీసదనంబునకరుగుము. లేకున్న మదీయముష్టిఘాతంబున కెరయగుదువు.

ధర్మ—సహోదరా ! భీమసేనా !

ఆ. వె. చంపదగినవాని ‡ జంపిత వదిధర్మ
మీపె యబలగాన ‡ నిట్టులనుట
తగదు తగదు జుమ్మ ‡ ధర్మవిహీనమ్ము
తలచిచూడచూడ ‡ ధార్మికులకు.

క. ఆపదయయినను ‡ ధర్మువ
ప్రాపుగ రక్షింపవలయు ‡ పరమార్థముధ
ర్మోపాయము ‡ ధార్మికులకు
నాపద జన్మాంతరమున ‡ కనగతమగుటల్.

అని నీతికోవిదులు పల్కువాక్యములు వినమే. దీనియందు రాక్షసభావ ముంచవలదు.

హిడిం—(తనలో) నామనోరథ మీడేరునట్లు తోచుచున్నది. ఏమీ నాపుణ్యము- (ప్రకాశముగా) అమ్మా ! కుంతీ ! _ మహాసాధ్వీ ! వందనములు.

కుంతి—తన్వీలలామవై వర్ధిల్లుము.

హిడిం—అవ్వా! సర్వప్రాణులకు సామాన్యంబయ్యును మనోజరాగం

బగ్గంలంబుగదా!

కుంతి—(చిరునవ్వు నవ్వుచు) తరుణీమణీ! నిజము

ఆ. వె. విషముద్రాగవచ్చు ॥ విషధిబడఁగవచ్చు
విషధరములవాత ॥ వేగవచ్చు
విషజమందుబడగ ॥ వెడలిపోవగవచ్చు
విషజశరునిబాధ ॥ వేగవశమె!

అమ్మా! అయ్యది యెంతటివారును దాటలేరు.

హిడిం—(తనలో) ఈమెను సమ్మతిపఱుపవచ్చు (ప్రకాశముగా) అట్లగ్గలంబైన మనోజశరాంగంబున నేనవ్వృకోదరు నిమిత్తంబున మదనబాధితనై నాచుట్టంబులను, చెలులను విడచితి. నాయిష్టంబు మీరు గావింపరేని ప్రాణంబుల విడతు. నన్ను రక్షించిన మీకు నిష్టంబులైనవానినెల్లను జేయుదును. మరి యిమ్మాగానియెడల మిమ్మందర నెత్తికొని మీరావలసినచోటికి గొంపోవగలను. నాపలుకుల నమ్ముము. మఱియు నతీతానాగత వర్తమానంబుల నెల్ల దెల్లంబుగా నెరుగుదు.

కుంతి—(తనలో) పాపమీకాంత మన్మధపీడితురాలై వృకోదరుని వలచియున్నది. ఈపెయంతఃకరణము పరిశుద్ధమైనది. (ప్రకాశముగా) కాంతా! ఆగతవర్తమానమునకేమిగాని, అనాగతమును జెప్పుము.

హిడిం—అవ్వా! వినుము. ముందర నొక్కసరోవరంబును నొక్కవనస్థలియునుంగలవు. అవిరెండును శాలిహోత్రుండను మహాముని చేతం దపఃప్రభావమునం బడసినయవి ఆసరోవరమునగల యుదకము ద్రావినవారికి నెన్నండు నాకలియును నీరువట్టును లేవు మీరలందున్న మీకడకు కృష్ణద్వైపాయనుండువచ్చి హితోపదేశంబుల జేయును.

కుంతి—(ఆశ్చర్యము నటించును)

ధర్మ—అర్జునా! వింటివా ఈతరుణీమణిజెప్ప భావికాలపలుకులు. (ఆశ్చర్యము నటించును)

అర్జు—ఆహా! యేమి (ఆశ్చర్యము నటించును)

కుంతి—కుమారా! భీమసేనా! నేనును మీాయన్నయు జెప్పుపల్కులు మహాధర్మమని యెదనాలోచించి మాపనుపు చేయుము.

భీము—(తనలో) ఈపె దనుజాకాంతను పరిణయమాడుమని జెప్పుచున్నదియా (ఆలోచించును)

ధర్మ—అనుజా! భీమసేనా! తల్లిగారుజెప్పుపల్కుల దప్పక మన్నింపుము

భీము—అమ్మా! నేనొనర్చు పరమధర్మకృత్యంబెద్ది?

కుంతి—నాయనా!

ఆ వె ఈపె పరమసాధ్వి ¿ ఎదవేరుదలపక
జాయరీతి నోనుము ¿ సందియమ్ము
నొందబోకుమింక ¿ బృందారకులుమెచ్చ
పరమధర్మ మిదియె ¿ నెరపుమింక!

ధర్మ—భీమసేనా! నాయనుమతంబు నదియే. పెద్దలుండ బిన్నవానివివాహ మధర్మమని యెంచెదవేమో? తదుపరి నీకు సర్వము నెరింగింతు. నీవాపె స్వీకరింపుము.

హిడింబి—(తనలో) ఏమినాభాగ్యము! ఎంతధన్యురాలను.

భీము—(తనలో) తల్లిమాటల జవదాటినయెడల మాతృద్రోహి నగుదును, అగ్రజుడు అన్ననువదలి నేబరిణయమానుట లధర్మముకాదనియెంచ నది ధర్మమని పల్కుచున్నాడు. వీరియాజ్ఞ నేనెట్లుజవదాటగలను. భగవంతుమీాదె వారిసమ్మతిజేసెద. (ప్రకాశము

[illegible]జా! మీ[illegible]వచనములు నిక[illegible]

కుంతి—[illegible]తెల్ల[illegible]నట్లున్నది.

అర్జు—కుక్కుటధ్వనులు వినవచ్చుచున్నవి.

ధర్మ—అనుజులారా! శాలిహోత్రునాశ్రమున కరుగుదము.

భీము—చిత్తము.



[అందరు నిష్క్రమింతురు]

ఇది ద్వితీయాంకము.





శ్రీదక్షిణా మూర్తయే నమః

# పాంచాలీ పరిణయము.

## తృతీయాంకము

### ప్రథమరంగము

రంగము — హస్తినాపురవీధి

[ప్రవేశము-కామశర్మ]

కామశర్మ—(ప్రవేశించి తనలో) కటకటా! పాండవులపై నిష్కారణ వైరంబుబూని దుర్యోధనుడు వారలమడియించెగదా! కృపావిహీనుడు, సుతమతోచితవర్తనుడు, ధృతరాష్ట్రుఁ డెంతగుండెనిబ్బరముగలవాడు? అయ్యో! తండ్రిలేనిపిల్లలనియు, తనతమ్ముని సుతులనియు నెంచక దేనెలొలుకుపలుకుల లోకులభ్రమింపజేసి తనయింటనుంచుకొని యాకుఱ్ఱల సుగుణవర్తనములను, బలోన్నతత్వమును సహింపనివాఁడైనాఁడుగదా! పోనిమ్ము వారల యుక్తవయసువచ్చువఱకు బెంచి వారల యర్ధరాజ్యమీయఁగూడదా! ఏమి నామందబుద్ధి అట్లు రాజ్యమునీయకుండగ నుండుట కేగదా పాండవుల వారణావతమున లాక్షాగృహమునసుంచి దగ్ధమొనర్చుట! ఆ - హా! కా-ల-మ-హి-మ! (పరికించి) అడుగో సోమశర్మ వచ్చుచున్నాడు.

సోమశర్మ—(ప్రవేశించి తనలో) ఈనా డెవ్వని మొగము చూచినాడ
నో కాని తెల్లవారినది మొదలింతవఱకు నాబ్ధికభోక్తలకే యెవ
రు పిలువలేదు నాజ్ఞానమెఱిగినది మొదలింతవఱకు నాగాయను
నది లేదు. పోనీ కాని సంభావనదొరకు శుభాశుభకర్మలెవ్వియు
వినబడుటలేదు కనబడుటలేదు (పరికించి) ఈతడు నాకొఱ
కు వేచియున్నవాడు. (పరికించి) ప్రకాశముగా ఓహో!
కామశర్మా! నీవా! ఏమిరా! కామశర్మ! ఎందులకో నిరీక్షిం
చుచున్నావు

కామ—నీకొఱకే నిరీక్షించుచున్నాడను.

సోమ—ఈదొంగమాట ఎప్పటినుంచి?

కామ—నిన్ను చూచినప్పటినుంచి

సోమ—నేను దొంగమాటలు చెప్పితినంచూయున్నావా! ఔనురా!
గూడేక్యాక్రియము ముక్కాలవారింట్లో ముసలమ్మపోయినప్పు
డు శ్రాద్ధకర్మలో మూడురూపాయ లిప్పించెదనని మూడుకాను
లిప్పించినావదియొకటి— నిరుడు నిరోగివారియింట్లో గర్భాదాన
మునకు నవగ్రహశాంతిలో తిలాదానమునకు దీవంచరూక లి
ప్పించెదనని ధారవదలిపెట్టించి పురోహితుడవుగనుక నన్నది వ
దుకుకొని రక్తహస్తములు చూపించినావు రెండు— ఇంకను చె
ప్పమంటావా? ఈదొంగమాట లెవరివిరా?

కామ—చాలు చాలులే! విశ్వాసఘాతకుడవు— చేసినమేళ్లు మరచి మం
చి చెడ్డక్రింద పరిణమించుకొంటివి. నీతో మాటలాడతగదు.

సోమ—ఒరే! కామశర్మ! నీతిజల సేతుబంధనము— పరిహాసమున కం
టినిరా—

కామ—పరిహాసముల కేమిలే!

సోమ—గాయత్రీసాక్షిరా! ఏయొట్టుపెట్టిన నాయొట్టు— నిజముగా పరిహాసమునకే యంటిని

కామ—నీకు నొట్టులక్ష్యమేమి? భార్యా; బిడ్డలా; తలిదండ్రులా; తోబుట్టువులా; అన్నదమ్ములా; ఒక్కటితప్ప—

సోమ—నీమాట నిజము— ఆయొక్కటియుదప్ప-

కామ—"సహవాసయో పుణ్యగుణాభవంతి సహవాసయో దోషగుణాభవంతి" నిన్ననవలసినదిలేదు- నాయొద్దచెప్పిన నీగౌరవమునకు భంగమా?

సోమ—నాగౌరవమునకు భంగమేమి? సర్వము అందరికి తెలిసియున్నదే. కాని యీరోజున నాకు నాగాయున్నదిరా!

కామ—ఎందులకునాగా?

సోమ—యెందులకో తెలియదా?

కామ—తెలసిన యడుగుటయేల?

సోమ—భోక్తత్వము.

కామ—ఆబ్దీకములా?

సోమ—మరే!

కామ—రోజు సంపాదనయెంత?

సోమ—ఏమనిచెప్పుదును. ఊరుచల్లగాయుంటే మనకేమికొదువ— నిత్యకళ్యాణము— పచ్చతోరణముకాదా! నాలుగు చోట్లకు దిరిగిన నాలుగు నక్షత్రములలో నాలుగుతిలో దెచ్చెదను. భోజనమునకేమి ధర్మపిండము- అందులో నేకభుక్తమేకదా - కాని ఈదినమున సర్వమునకు నాగాగాఁ దోచుచున్నది.

కామ—సోమశర్మ! విచారింపనవసరములేదు- తగుసంభావన యిప్పించెదనులే.

సోమ—(ఆతురతతో) ఎక్కడ? ఎక్కడ?

కామ—పాండుమహారాజుగారి కుమారుల నెరుగుదువా?

సోమ—ఎరుగ కేమి యెరుగుదు.

కామ—వారు మృతినొందిరిసుమా.

సోమ—అయ్యో! పాపము గాంధారికి యెంతదుఃఖ మబ్బినది. కేవలము తమ్ముళ్లుగదా! ధృతరాష్ట్రున కెంతవిచార మబ్బినది.

కామ—ఓరినీయిల్లుబంగారముగాను. గాంధారికి దుఃఖమేమిరా? ఆమె కు తమ్ములెవరు? సరిసరిలే నీ తెలివి కాలినట్లేయున్నది- ధృతరాష్ట్రుని సోదరసుతులు పాండవులు-

సోమ—అయ్యో పాపము! పాపము! వీరలా పాండవులు- మఱచితి- ఏమికారణమున మరణించిరి?

కామ—ఇదియంతయు దుస్తంత్రము- బహిరంగముగా మాటలాడరాదు అయినను నీకు జెప్పెదమనిన నొకమాటతో గ్రహించు కునాగ్రబుద్ధివికావు- ఎవ్వరైన వచ్చుచున్నారేమో- మననోటికి కరకాయవచ్చును.

సోమ—నీవుచెప్పినట్లు నేను ముసలాగ్రబుద్ధినె! కాని- ఆలోచించిచూచిన- దు-ర్యో-ధనుని కపటమేమైనగలదా! యేమి?

కామ—అదియే చెప్పెదను రమ్ము

సోమ—నడునడువుము- రోజున కధమపక్షము నక్షత్రమునకు తక్కువ యుండకుండిన నెవరెటుపోయిననేమి.

[నిష్క్రమింతురు]



## ద్వితీయరంగము

రంగము—సభాభవనము

[ప్రవేశము—ధృతరాష్ట్ర, భీష్మ, ద్రోణ, విదురులు]

ధృత—ఆహా! కర్ణకఠోరవార్త వింటిమికదా! కన్నీరుతుడిచికొనుచు) హా?ధర్మరాజా! హాభీమసేనా! హాఅర్జునా! హానకులసహదేవులారా! హాకుంతీమహాసాధ్వి! మీకెట్టువిపత్తు చేకూరెను!

భీష్మ—ఆహా! పాండవులారా! మమ్ములవిడచి దివికేగితిరా! మీయశఃచంద్రికలభక్షించి సంతసమొందనెంచిన చకోరపక్షులమగు మమ్ముబాసితిరా! హా! పాండవులారా!

ద్రోణ—ఆ. వె. అస్త్రవిద్యలందు నధికకుశలుడవగు
నీవుగురునిపేరు నిలుపుదువని
నమ్మియుంటి మదిని సుమ్ము ధనంజయా!
గురునివిడచి దివికి నరగినావ!

విదుర—హా! పాండవులారా! ఎంతమాటవినగలిగితిమి

ధృత—

సీ. పరమధర్మముభువి నెరపివంశమునకు
యశముదెత్తురటంచు నాసనుంటి
అనుజుసుతులటంచు దనయులకన్నను
పెంపెక్కుదయతోడ బెంచుచుంటి
అస్త్రశస్త్రములవిద్యలనెల్ల గురునిచే
గరపించిఘనులౌట మురియుచుంటి
అర్ధరాజ్యమునిచ్చి యవనీతలంబెల్ల
బాలించుమిముగన వాంఛనుంటి

గీ. వాంఛ లెల్లను నేటికి వ్యర్థగలిపి
కడకు మమ్ముల కడుదుఃఖ జలధిముంచి
గురులతమ్ములనన్నల ధరణిఁబడచి
యేఁగితే? దివికి పాండుకుమారులారా!

హా పుత్రులారా! హా! కుంతీ! మీ కెంతటిదురవస్థ సంభవించి
నది. ఇంతకు మేము నిర్భాగ్యులము.

విదు—(తనలో) చేయిగాలినపిదప నాకు ముట్టినలాభ మన్నట్లు నీబొబ్బ
లేమ్పులు విశ్వసించవచ్చునా ? సుతుని మందలించుకొనలేక
జేతులార పాండవులనటకుఁబంపి జంపింపనూహించు సుతునిమా
ట జనదాటలేనివాఁడవు వీరల కర్ధరాజ్యమిచ్చి సంతసమందెద
నను కొంటి నని చుంటివా ? నీసత్యవాక్యములు జూతముగదా !
పాండవులు వినుతసద్గుణగణగేయులు, యశోవిశాలురు—సద్భాగ
ధేయులు—ధర్మనీతివర్తనలు—వారలు దుష్టులబడిమార్చక ప్రాణం
బులవిడుతురా ! దుర్మార్గులట్లు ప్రయత్నించిన వైనశిష్టరక్షణ
దుష్టశిక్షణ దక్షుండగు భగవంతుండు లేడా ?

భీష్మ—అయ్యయ్యో ! ఎంతపనిజరిగినది. హా పాండవకుమారులారా !
మిమ్ముల బాసిబ్రతుకగలమా ? కటకటా ! యాముక్కిడివిధికి
మీప్రాణంబులే బలువయ్యెనా ? మీయాకృతుల నింక మేమెట్లు
జూడగలము ? చీకురాజు మిమ్ముల వారణావతంబునకంపెగదా?
పదోపాహండా లాక్షాగృహంబునకు నిప్పుదగిల్చెనోగదా !

ద్రోణు—అట్టిపాపి యెవ్వడైయుండును ?

భీష్మ—పాపము భగవంతునకెఱుక మనమెరసి నిర్ణయించగలము?

విదురు—గతించినదానికి వగువనేల ? ఆయువు మూడినవారినొకరు జంపి
రననేల ? వారలకాయువు మూడినది. పుట్టుట గిట్టుటకేగదా !
సుగుణధనులు పాండవుల గోల్పోయితిమి. వారల నొకరు జం

పించిరని యొకరినననేల ? గోడపెట్టును, జెంపపెట్టును యేల ?
ఎందులకీవిచారము. ప్రీతబంధుయమసంవాదమున-

ఉ. మచ్చికవీరికెల్లబహు ॥ మాత్రము జోద్యముదేహిపుట్టుచుం
జచ్చుచునుండ జూచెదరు ॥ చావకమానెడివారిభంగి నీ
చచ్చినవాని కేడ్చెదరు ॥ చావునకెల్లగ డాగవచ్చునే
యెచ్చటబుట్టె నచ్చటికి ॥ నేగుట నైజము ప్రాణికోటికిన్.

అనుచు నుడువు నీతికోవిదుల పలుకుల వినమె

ధృత—నిజము నిజము మాయాగుణప్రపంచంబు నెరిగెడు తత్వజ్ఞులు ప్రపంచకస్వభావము విశ్వసింపరు. మనమట్టిజోగులమా ! కర్మ యోగులము- భోగులము ఈవిచారము నామదిజన్మమున్నంత వరకు దహించుచుండును.

భీష్మ—అగును. (పరికించి తనలో) ఓరోరి ! కులద్రోహి ! ఆతావున నాదుష్టచతుష్టయ మెట్లు గుసగుసలాడుకొనుచు నవ్వుకొనుచుం డిరో ! ఛీ ! నేనిట నిలువరాదు (ప్రకాశముగా) రాజా ! నేన రుగుచుంటి. నీవిచారంబున నీకొలువున నిలువలేను

ధృత—జరుపవలశినవిధులకు నేను వచ్చుచుంటి.

విదుర—అరుగుదమురండు.

[అందరు నిష్క్రమింతురు.]

దుర్యో—కర్ణా ! దుశ్శాసనా ! మాతులా ! రండు రండు.

[ముసలిబడుగు లరిగిరి.]

[కర్ణ, దుశ్శాసన, శకును లరుదెంతురు.]

కర్ణ—దుర్యోధనమహారాజా ! నేడుగదా ! మనకు సంతసము.

శకుని—ఈదినమే సుదినము.

దుశ్శాస—లాక్షాగృహంబున వారలు దహనమొందిరనువార్త నిక్క మేనా ?

శకుని—కుఱ్ఱవాడవు. నీవిట్లు పేలవంబగుప్రశ్నంబున వెల్లడిగ మాటలాడెదవేల ? నిజముగాకుండునా ?

దుర్యో—

ఆ. వె. భీతివదలె ? వక్షమునను జేయి
వెట్టుకొనిన నిద్ర ? వట్టియున్న
నెరపులేకయుండు ? మురిపె మబ్బెనుగదా
వేయిజెప్పనేల ? విహితులారా !

కర్ణ—మిత్రమా ! చూచితివా ! ఆభీష్మద్రోణుల ముఖారవిందములు. సుర్కి మెట్లుబొగలి యేడ్చుచుండిరో !

దుర్యో—కర్ణా ! పాపము ద్రోణునిప్రియశిష్యు డర్జునుడుగదా ! మిగుల యశముసంపాదించునని తలచెనట. ఈతనితలపులు జలధిదాగెనట.

దుశ్శా—అహాహా! బాగు బాగు

శకుని—విదురుడు మానముదాల్చియుండె. కారణమేమియో!

కర్ణ—విదురుడైన నిప్పుడేమిచేయగలడు ? తగినరీతిని జరిగినది.

[లోపల]

హా ! పాండుకుమారులారా ! అయ్యయ్యో ! మమ్ములవదలి దివి కేగితిరా!

దుర్యో—మిత్రులారా ! పౌరులెట్లు లాక్రందనముసలుపుచుండిరో!

కర్ణ—మిత్రమా! మనమిచ్చటనుండి ఇటులమాటలాడుచుండిన నెవ్వరైన ననుమానపడకదప్పదు మీరును విచారము వెల్లడించిన బాగుగానుండును.

శకుని—కర్ణునియాలోచన బాగుగానున్నది.

దుర్యో—నేనట్టులనే తలచుచుంటిని.

[తెరలో]

అయ్యో! పాండుకుమారులారా! దుష్టుఁడగు దుర్యోధను కైత
వంబునఁ లక్కయింట మడిసితిరా! కటకటా!

దుర్యో—(ఆతురతతో) కర్ణా వింటివా! ఏతులువయో యిట్లు ప్రేలుచుండె

కర్ణు—(తనలో) ఈగుట్టు తెలిసెనా! (ప్రకాశముగా) ఔనౌను మనకే
ది కర్తవ్యము?

శకుని—కర్తవ్యమున కేమి? తులువపలుకులు పలుకు తులువల దండించుటయే

దుర్యో—ఔనౌను.

ఉ. ఎవ్వఁడవోరి నీచమతి ఽ యెచ్చటనుంటివి కారులార్చెదో
ద్రొవ్వన లేనిపోని పలు ఽ కూతల గూసెదవోర పాపి నీ
కెవ్వరు తోడువచ్చెదరి ఽ దే గనుగొమ్మిక వచ్చుచుంటి నీ
నవ్వును బెట్టి యుష్మదశి ఽ రంబు కరంబున వ్రక్కలింతురా!

దుశ్శా—(ఆగ్రహముతో)

చ. నిలునిలు మోదురాత్మ ఽ విమనీషివతంసు మదగ్రజన్మునిన్
విలసితసద్యశస్స్నన వి ఽ వేకవిహీనత కారులార్చు నీ
తల యిదె పిండిజేసి యమ ఽ ధామము జేర్చెద దుస్ససేను దో
ర్బలము నెరుంగవా? వినవొ ఽ బారకు మెవ్వడు నీకుఁదోడురా.

దుర్యో—నడువుము.

[అందరు నిష్క్రమింతురు]

---

## తృ తీ య రం గ ము.

---

రంగము:— పాంచాలదేశరాజధాని, పురవీధి.

[ప్రవేశము—లంబోదరుడు]

లంబో—రాజగృహమందు వివాహమెప్పుడగునోగాని స్వాతివర్షమునకు
ముత్యపుచిప్పలవిధమునను వర్షమునకు ఛాతకములవిధముగను

వసంతాగమమున కారామసంతతివిధముగను, సూర్యోదయము నకు చక్రవాకంబులవిధమునను నామన మెదురుచూచుచున్నది.

[తెరలో భోభ్రవుమని ముమ్మారు తేనువులు వినవచ్చును]

లంబో—(పరికించి) ఎవరాతేన్పునది? ఆ- ఆ- ఆ- ఓహోహో! నాగం భొట్లా! సమయమునకు వచ్చితివి- ఇదిగో- ఇదిగో- ఇటురా?

[తెరలో తేనువులువినబడి] వచ్చితిని- ఏమి?

లంబో—వచ్చితిననుట యొకతడవయు వచ్చుట రెండవతడవయునా? సత్వరమునరా?

నాగం—ఓహోహో! బావా! నీవా- ఆలస్యమునకు క్షమింపుము— దండములు—

లంబో—నీదండములు నాప్రాణమునకు గండములు. చంకదుడ్డు -శరణార్థి- ఏమిపలుకులు? నీరీతి బాగుగానున్నది.

నాగం—బావా! అటనుచుంటివేల?

లంబో—నీవు చెప్పకుండి నందులకు?

నాగం—నీతో చెప్పనిహంశ మేమైనాయున్నదా?

లంబో—ఆలోచించిన?

నాగం—ఒక్కటిచెప్పూము.

—నీకు తెలిసియే నానోట ననిపించవలయునని

నాగం—గాయతి

బో—ఆ! ఆ! ఒట్టెందుకులే

ా! ఎందుల కీవంకర మాటలు?

లంబో—మాటకు వంక రెక్కడ? నడతకనుము

నాగం—చాలు చాలు! నీమనస్సులోనున్న సందియమేమో చెప్పు.

లంబో—ధృపదరాజుగారి- తెలిసినదా!

నాగం—రాజుగారి- ఏమిటి- చంపక చెప్పుము.

లంబో—తెలియకేమి? దొంగవేషము.

నాగం—ఇదిగో! ఇందుకే నీతో మాటాడుటకు తలనొప్పి.

లంబో—మాటలకు తలనొప్పి నేనెరుగను?

నాగం—బాబు! చంపకతేల్చుము— నీకొకనమస్కారము

లంబో—ధృపదరాజుగారికూతురు— ఇంకను తెలియదా?

నాగం—ఎన్నడో జరిగినబారసాలవిషయమైయేనా? బాగు! బాగు, ఎంతకృష్ణుడవోయి పదివరహాలు పట్టుకుని వెళ్ళినవారెవరో?నా మకరణమహోత్సవసమయమందిచ్చిన బహుమతి నెవరుతీసికొనిరో? ఆహా! గతించినసంగతి మరచితివా?

లంబో—అబ్బా! కాదోయి! వినవు— చిన్నవాడవు!

నాగం—చిన్నతనముకాదు— నీమాటలు

లంబో—నీమాటల కేమి?

నాగం—మాటలుకావు మాటలరూపుతోనున్న బల్లెపుపోటులు

లంబో—సరిలే! నీమాటలు— నీచేష్టలు బాగుండును— నీతోమాటలాడను లే

నాగం—ఎందులకుచంపెదవు నీతోజెప్పక నేను జేసిన ద్రోహమేదియో చెప్పరాదా?

లంబో—చెప్పుట కేమియున్నది ధృపదరాజుగారికుమార్తె వివాహమట ఎరుగుదువా?

నాగం—ఆహా! (నవ్వుచు) ఇదియా! ఆ! ఎరుగుదును

లంబో—నాతో జెప్పినావా! నేననినమాటలు నీకు బల్లెపుపోటులా! నీది తప్పుకాదా! చెప్పు చెప్పు చెప్పవేమి? ఇక మాటలాడవు.

నాగం—(నవ్వుచు) బావా! నిన్నందురు ఛాందసుడవని యన్నందులకునా కిప్పటికిగదాబోధపడినది.

లంబో—వ్యర్థప్రసంగము లేలచేసెదవు? తప్పొప్పుకొనవుకదా!

నాగం——లగ్ననిశ్చయములేని పెండ్లికి పెండ్లెప్పుడని నీతో జెప్పుదును?

లంబో——నీవు చెప్పకున్న పెండ్లినాడైనా తెలియదా?

నాగం——అంతకోప మెందులకు? తప్పు క్షమింపుము, [అని రెండు చేతులు బట్టుకొనును]

లంబో——పోనిమ్ము— ఇదిగో! ఇదిగో! రహస్యము.

నాగం——ఆరహస్య మేమి?

లంబో——(నాగంబొట్లు చెవివద్ద నోరుపెట్టి మెల్లగా జెప్పును.) తెలసినదా?

నాగం——వినుబడుట లేనిదే? ఏమి తెలియును? (తనలో) నాకు ప్రాణసంకటమువచ్చినది. నేడెవరిముఖముజూచితినో యీానందసునితో సంభాషణము సిద్ధించినది.

లంబో——ద్రౌపదిని యిచ్చుట ఎవరికి?

నాగం——బావా! చంపితివోయి! దీనికి రహస్య మెందులకు?

లంబో——చిన్నతనము— రహస్య మెందులకా! ఆడపిల్లను కనినవారికంటె నిర్భాగ్యులెవరైన ప్రపంచముననున్నారా! ఏమందువా? వరాన్వేషణమున నెంతకష్టము— ఒకఅంశమున కుదిరిన రెండవది కుదురదు— విద్యారూపసంపద, సాంప్రదాయములు కుదరవలె. అందు క్షత్రియులకు ముఖ్యముగా భుజబలశౌర్యములు ప్రధానములు. ఇన్నిహంశములు— పాప మాద్రుపదమహారాజు విచారించి యెట్లు చూచినాడో! అంతకష్టపడి సంబంధము స్థిరపఱచుకొనకుండా యున్నప్పుడు మనము వెల్లడించిన లోకులు వినిన కట్నకానుకల యందెక్కువ ముట్టజెప్పి పరరాజులయొక్క పిల్లల నిప్పింతురే మోయని.

నాగం——ఆసందేహము వీరికక్కఱలేదు.

లంబో——ఎందుచేత?

నాగం——ఫాలాక్షుడడ్డమైన నీసంబంధమనుకున్న చోట నీయడమగును.

లంబో—ఎవరికి?

నాగం—పాండవమధ్యమునకు.

లంబో—అర్జునునకా?

నాగం—కాను

లంబో—భీముడు బలశౌర్యసంపన్నుడు. అతని కెందులకీయరాదు ?

నాగం—దానికి కారణములున్నవి.

లంబో—ఆకారణము వినుటకొఱకే నిన్నిట్లు ప్రశ్నించునది.

నాగం—ద్రోణాచార్యుల నెరుగుదువా?

లంబో—ఆ యెరుగనేమి? శుక్రాచార్యులకుమారుడందురు. ప్రహ్లాదున కు విద్యలు చెప్పవచ్చినవాఁడు.

నాగం—కాదు కాదు. భరద్వాజ కలశసంభవుఁడు పాండవ కౌరవుల గురువు.

లంబో—(ఆశ్చర్యముతో) అట్లనా! ఆతఁడు భరద్వాజకలశయం దెట్లు ద్భవించినాడు?

నాగం—చెప్పెద వినుము. పూర్వము భరద్వాజమహర్షి గంగాప్రవంత పుణ్యజలంబు లభిషేచనార్థమునకై జన నందు జలక్రీడలాడుచు నున్న ఘృతాచియను నదమలాంగి పవనాపేతపరిధానయై యున్న యవసరంబున బొడగాంచి యమ్మృగాక్షి గామించియున్న దత్కామాతిరేకమ్మున దనకు శుక్లపాతంబైనదానిదెచ్చి ద్రోణ మున సంగ్రహించిన భరద్వాజమునికి ద్రోణుడన నావిర్భవించె.

లంబో—అబ్బా! ఎంతగాథయున్నదోయి- అయితే యీద్రోణుని యె రుగుదును.

నాగం—ఎప్పటినుంచి?

లంబో—నీవు చెప్పినప్పటినుంచి-

నాగం—బావా! నీతో ప్రసంగము నవ్వుగానున్నది.

లంబో—నాసందియము జెప్పుము.

నాగం—మరచితి. ఆద్రోణాచార్యుండు మననృపశేఖరుండును, ఒక్క గురునియొద్ద విద్యనభ్యసించిన ప్రాణస్నేహితులట-

లంబో—(ఆశ్చర్యముతో) ఆహా! అటులనా- తరువాత

నాగం—ఇట్లు కాలముగడచినతరి ధ్రుపదుఁడు రాజయ్యెను. ధనలేమిచే నిద్రోణాచార్యుండు మిత్రుఁడననియు, ద్రవ్యసహాయార్థము వచ్చితిననియు జెప్పగా నాతఁడాగ్రహాయత్తచిత్తుండై ఓరి విప్రాత్రమా! చులకనగా నీమిత్రుఁడనని పలుకుచుంటివి. ఆహా! ధనవతితో దరిద్రునకును, తత్త్వవిదునితో మూర్ఖునకును, ప్రశాంతునితోడ క్రూరునకును, రణశూరునితోడ భీరువునకును, సజ్జనునితోడ దుర్జనునకును, భూధవులతోడ భూసురులకును సఖ్యతసంభవించునను మాట కల్లయని నిరాకరించిన... ... ...

లంబో—ఎంతపనిజరిగినది? ఆ! ఆ! తరువాత-

నాగం—తరువాత నేమియున్నది? ద్రోణుండు హస్తినాపురంబునకరిగి కౌరవపాండవుల నస్త్రకోవిదులజేసి వారల గురుదక్షిణార్థము తన్ను మున్ను పరాభవించిన ద్రుపదుబట్టి కట్టి తీసుకొని తనకడ నుంచుమనియె.

లంబో—ఓహొహో! ఆభూసురునిదియు తప్పుచుపగయే.

నాగం—అప్పుడు పాండవమధ్యముఁడు ద్రుపదునిజయించి గురుదక్షిణార్థముతనికట్టిగురుని కట్టెదుటనునిచెను. అతడు ద్రుపదుని మందలించి కట్టులవిడపించి నీదేశమునకు బొమ్మనియె.

లంబో—ఆ! ఆ! ఆ! ఎంతపనిజరిగినది? బదులు ఆబోడిబాపడు దీర్చుకొనినాడుగా!

నాగం—తరువాత ద్రుపదుండు తన్ను పట్టికట్టి గురుదక్షిణార్థము తీసికొని జనిన ఫల్గునకు జాయగ నొప్పునుతయు, తన్ను పరాభవించిన

ద్రోణునిసమరంబున సంహరించుసుతుఁడును, కావలయునని తప మాచరించి వరప్రభావమున నయోనిజుల దుష్టద్యుమ్న ద్రౌపదు లఁ గనెను.

లంబో—అందులకా! సరిసరి! అర్జునునకిచ్చెద రనుము.

నాగం—బావా! నీసందియము తీరినదిగదా!

లంబో—ఆ! ఆ! నిస్సందేహముగా-

నాగం—నాకు శెలవు.

లంబో—అయ్యో! అయ్యో! నీకుశెలవే? శెలవే! అయినను శెలవయిన నందరు జనువారలే-

నాగం—ఎచ్చటికి?

సంబో—నీవెచ్చటికి?

నాగం—ఇంటికి.

లంబో—దివికి.

నాగం—సరే! కాలయాపన మగుచున్నది. నేనరిగెద.

లంబో—ఇదిగో! మాట మాట - ఇచ్చట నుండువారెవరు? నేను వచ్చుచుంటివి.

నాగం—రమ్ము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

ఇది తృతీయాంకము.





శ్రీదక్షిణామూర్తయేనమః

# పాంచాలీ పరిణయము.



## చతుర్థాంకము

### ప్రథమరంగము.

(రంగము)-ఆరామము.

[ప్రవేశము- ద్రౌపది, భ్రమరిక.]

భ్రమ—అక్కా! నీవు చదువుపుస్తక నామమేది?

ద్రౌప—సావిత్రి!

భ్రమ—ఏకథాసందర్భము?

ద్రౌప—వివాహ......(సిగ్గభినయించుచు)

భ్రమ—అక్కా! సిగ్గుపడెద వేల? పుస్తకము మంచిది. (అని నవ్వును.[

ద్రౌప—ఇందులకే నీతో సంభాషణ మప్రశస్తనీయము.

భ్రమ—ఔనౌను ఉన్నమాటయనిన నెవరికి కోపమురాదు?

ఆ. వె. ఉన్నమాటజెప్ప నులుకుసంభవమొందు
వసుధజూడ నెంత వారికయిన
తరుణి నీవె యిందు తార్కాణమైతివి
గాదె వేరుజెప్ప గడగు టేల?

ద్రౌప—ఎప్పుడు నిట్టిమాటలే!

భీమ—సరిలే! మాటలాడుదును.

ద్రౌప—భీమరికా! సావిత్రిమనోనిశ్చయము జూచితివా!

భీమ—ఆ మనోనిశ్చయము ఎట్లులనో చెప్పుము?

ద్రౌప—రాజ్యవిహీనుడైనను అరణ్యమునవశించినను ఏదియెట్లులైన నే నాసత్యవంతుని పరిణియమాడెదననె.

భీమ—ఔనౌను! నేను వింటినిసావిత్రియట్లనుటకు కారణమేమి?

ద్రౌప—అనురాగము.

భీమ—అనురాగమునకు ముఖ్యకారణము సంపదగదా!

ద్రౌప—ఔను సంపదయే?

భీమ—అట్టి సంపదలేనివాడు గదా!

ద్రౌప—కాదు! కాదు! అతనికి సంపదగలదు.

భీమ—అక్కా! రాజ్యహీనుడై తలిదండ్రులతో వని మునివృత్తినుండి రని నీవే పల్కితివిగదా! సంపదయెక్కడిది?

ద్రౌప—రాజ్యసంపదయా ముఖ్యము?

భీమ—కాక!

ద్రౌప—సత్యవాక్ప్రవీణత, భుజ బల శౌర్య పరాక్రమసంపద లాతనికి గలవు

భీమ—అక్కా! నీమతము సమ్మతమే పాండవులును సత్యసంధులు-భుజబలపరాక్రమవంతులు సుమా!

ద్రౌప—(సిగ్గు నభినయించును) ఔను,

భీమ—(తనలో) ఈమెకు పాండవమధ్యమునిపై మనోవాంఛ (ప్రకాశముగా) అక్కా! వత్సరమునుండి నీతండ్రిగారెక్కువ ప్రయత్నమొనర్చుచుండిరి.

ద్రౌప—(మాటలాడకనూరకుండును)

భీమ—(తనలో) ఈమెకు సిగ్గును మనసునుకూడ వరలుచున్నవి. మన

సు ముందునకు సిగ్గు వెనుకకు మనసు దోఁ్రయుచున్నవి. వేరొక ప్రసంగమున బెట్టెద- (ప్రకాశముగా) అక్కా! ఆమాధవీలతను జూచితివా?

గాప్రిప——ఎంత బాగుగానున్న దే! నవనవలాడు కిసలయంబులతోఁ, పుష్ప సంతతులతోఁ, చూపరులకు సొంపుగులుకుచున్నది.

భప్రిమ——యౌవ్వనారంభ కన్యకను నిరసించుచున్నది.

గాప్రిప——(నవ్వుచు) నిజము.

ఆ. వె. పసుపుటాకుఱవిక ౯ పొసగగ దొడగియు
నాకు పచ్చచీర ౯ జోక దొడగి
నెఱవిరివితతుల ౯ కుదుల్పై దాల్చి
తొగుణయునగసల ౯ తకనదపరె.

భప్రిమ——అక్కా! వర్ణనము బాగుగానున్నది కాని, దీనికెంత యందమున్న నేమి?

గాప్రిప——ఏమేమి లనుచుంటివి? దానికేమికొదువ?

భప్రి——కొదువ యేదియో నీకు తెలియదా?

గాప్రిప—— తెలిసిన యడుగుట యేల?

భప్రిమ——అటుచూడు మామామాలతి యెట్లు సొబగు చెందియున్నదో?

గాప్రిప——బాగుగా విస్తరించియున్నది. కాని దానికిని దీనికిని కొంత తారతమ్యముగలదు. ఏమందువా? చాలకాలముక్రిందట దానినాటి రి. ఈమాధవి చిన్నప్రాయముగలది మొన్న మొన్న నే దీనినాటి రి. ఇంతకు మాధవియు బాగుగా నెదుగుచున్నది.

భప్రిమ——పెరుగుట కేమి? రాజకుమారివలె సుకుమారమున నెదుగుచు చున్నది. కాని-

గాప్రిప——కాని యనియెద వేల?

భీమ—మాలతి యొక్క దారువు నాశ్రయించిక దా శోభాయమానమైన
ది. అట్టిది దీనికిలభింపకుంటచే-

ద్రౌప—ఔనౌను సహజమే.

భీమ—స్త్రీలకును అదియే సహజమునుమా!

ద్రౌప—ఎట్లు?

భీమ—ఎంతయౌవ్వనయుక్తురాలైనను, ఎంతసౌందర్యవతియైనను తగి
న భర్త దొరకినగదా? శోభాయమానము.

ద్రౌప—ఔను.

భీమ—నీమనోనిశ్చయము నెరిగితిని. అద్దియు నీవు చదువు సావిత్రి
చరిత్ర సారాంశమువలననే తేటతెల్లమయినది ఇంక నెందులకీ
దాపరికము?

ద్రౌప—(నవ్వుచు) ఏమిదెలిసినది?

భీమ—తెలియవలసినదే.

ద్రౌప—అది యేదియో చెప్పరాదా?

భీమ—విజయాభిలాష.

ద్రౌప—భీమరికా! ఎందులకీ వచనంబులు. నాబోటినిర్భాగ్యురాలు
న కావిజయుండు వరుండగునా?

భీమ—(తనలో) ఇంక నీపె నుడికించిన కార్యములేదు. (ప్రకాశము
గా) అక్కా! తప్పక నీమనోవిజయము ఘటించగలదు.

ద్రౌప—దైవేచ్ఛ. భీమరికా! కాలాతీతమయినది. మనకై శారికా
కీరవాణులు పరితపింతురు.

భీమ—(నవ్వుచు) అక్కా! శారకాకీరవాణుల పలుకులు నీవెట్లు విన
గలుగుచుంటివి?

ద్రౌప—ప్రాణసములు. సఖులు నీవలెనే-

భ్రమ—నావలెను కాదు- వారు కాదు- విరహావేశకరులు.

గ్రీప—నీవిలాసమున కేమి పోవుదము రమ్ము.

భ్రమ—సమ్మతము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

## ద్వితీయ రంగము.



రంగము- కొలువు

[ప్రవేశము, ద్రుపదమహారాజు-మతిమంతుడు]

ద్రుప—

గీ విజయుఁడల్లుఁడు కాఁగోరి వేల్పులదయ
బడసినాఁడను సత్పుత్రి ధర్మగాత్రి.
పరిణయ మొనర్చి నాదుత పఃఫలంబు
సార్థకము జేయవలె గాదె సచివవర్య.

మతి—రాజేంద్రా! సాలంకృతకన్యాదానంబున ముందు మూఁడుతరం బులు వెనుకమూఁడుతరంబులు తరింతురనివిరించి సన్నిభులుపల్క వినమే!

ఆ వె పరిణయ మొనరించ వయసరుదెంచిన
కన్నెనిమ్మ్మ నెంచ దెన్న కాదు
తగినవరునిజూచి తద్దయు నుద్వాహ
ము నొనరించుటొప్పు భూతలమున.

అను బుధోక్తి వినమా! కావున సత్వర వివాహలగ్న మేర్పరచి శుభకార్యము జరుపుట శ్రేయస్కరముగదా!

ద్రుపదు—ఔనౌ నందులకే విచారించుచుంటిని.

సేవకుడు—(ప్రవేశించి) దేవరవారికి జయము. జయము. ద్వారముకడ జోస్యులు వచ్చి నిల్చియున్నవారు.

ద్రుప—అనుకొనుచుపని తక్షణమే నెరవేరగలదు. సేవకా! వారినితక్షణమే లోనికి బ్రవేశపెట్టుము.

మతి—కాకతాళన్యాయముగా ఆగతానాగతంబులు జక్కగా నెరింగిన జ్యోతిశాస్త్రపారంగతులు వచ్చియుండట మనమనోవాంఛ సిద్ధి గదా!

ద్రుప—నిజము. అదుగో జ్యోస్యులు వచ్చుచున్నారు.

జ్యోస్య—(ప్రవేశింతురు)

ద్రుప—బుధవరేణ్యా! నమస్కారములు.

మతి—కోవిదశిఖామణీ! వందనములు

జోతిష్కుడు—

చ. సరసిజసంభవుండు వన । జాతవిలోచను డద్రివాసు డు
న్కరుణక్షితీశమంత్రులసు । ఖంబులనాయువరోగమున్సిరిన్
దొరకొనజేసి కీర్తిని కు । తూహలమొప్పెడు వైభవంబుచే
కురనొనరించి గావుత స । కుంచితవైఖరి నెల్లకాలమున్.

ద్రుప—మీరాకచే మాగృహపావనంబయ్యె నాజన్మతరించినది.

మతి—ఆర్యా! మారాజకుమారి పరిణయం బెంతకాలమునకు ఘటిల్లునో ఆనతినింపు

జ్యోతి—(లెక్కించి) నెలదినంబులకు తప్పక నిర్విఘ్నముగ నొనగూడు

ద్రుప—సంతసముగదా

[తెరలో]

ఆహా! ఏమివిపరీతము— పాండవులే! పాండవులే! లాక్షాగృహంబునా! ఎంతవిచారము— ఆదుర్యోధనుని మోసమే!

ద్రుప—(ఆలకించి)ఏమి! ఆవిచారము మంత్రిశేఖరా! పాండవులా! అను

చుండెడె వింటివా! (తనలో) పాండవుల కేదియైన కీడుమూడెనా? దుర్యోధనుని కైతమనుచుండెడె తప్పక నిదియేయథార్థము, పాండవుల కేదియో కీడుమూడినది, (ప్రకాశముగా) రాజశేఖరా! కర్ణకఠోరవాక్యములవలె దోచుచున్నవి.

దృ—సేవకా! ఏమియాధ్వని.

[తెరలో]

మహారాజా! పాండవులు లక్కయింట దగ్ధులైరట

దృ—అయ్యో? అయ్యో? ఎంతవిచారము భుజబలపరాక్రమసంపన్నులు ధర్మవర్తనులు సద్గుణవంతులు సద్యశఃప్రకాశులు- కౌంతేయులు అయ్యో! పాండవులారా! మీకెంతవిపత్తు చేకూరినది.

గీ. విజయు డల్లుడగునని ॥ నే వేడ్కనుంటి
ద్రౌపదికి లోటులేదని ॥ తలచుచుంటి
తలపులెల్లను చూడ జం ॥ తలుగ మారె!
కటకటా! మోసమెంతె సం ॥ ఘటనమయ్యె!

హాపాండుకుమారులారా!

స మీధర్మవర్తన ॥ మీసత్యవర్తన
మీనయసుగుణము ॥ లెన్నకేతగును
మీరూపసంపద ॥ మీతేజసంపద
మీముఖకాంతులు ॥ మీకెతగును
మీధైర్యచర్యలు ॥ మీబలచర్యలు
మీశూరభావము ॥ లెన్నకెతగును
మీబుద్ధికుశలత ॥ మీనిర్మలమతులు
మీభోగ్యసౌఖ్యంబు ॥ మీకెతగును

గీ. హరికుమారుడు మారుడు ॥ హరసుతుండు
రాజనందను డైనయో ॥ విరాజులార

మాన్యచరితులార! వినుత ధన్యులార
ధీరవరులార! పాండుకుమారులార!

ఇక నేనేమిసేయుదు. ఏదిదారి- "అన్యథా-చింతితమ్ కార్యమ్ దైవమన్యత్రచింతయే" త్తను రీతియయ్యె

ఉ. కూతును ధన్వికిచ్చి కడు కౌతుకమొప్పగ బెండ్లిచేసి జా
మాతయు బుత్రికామణియు మందిరమందుననుండజూచు సం
ప్రీతికి సున్నజుట్టె మము పెక్కువిచారము బెట్టియుంటివో
ధాత ఘనుండవీవనుట తప్పగదా! శుభఘాత జేయగా

ఆహా! నలువ యెంతపని జేసితివి? (ఆలోచించి) నీసాంప్రదాయ మునకుసుగుణముగ జేసితివి.

సీ. ఒకమాత జారిణి ఒకమాతచంచల
జారచోరుడు నీదు జనకుడెన్న
సోదరరూపంబు చూడననంగుండు
మామ గురుద్రోహి మలినుడెన్న
ధర్మపత్ని యెపుడు తలవాకిట వసించు
భంగకరము తాత భావమెన్న
తలపకులాలక్ష్మి త్వం బొనరింతువు
శివునిచే నొకతల శిథిలమయ్యె.

ఆ. వె. బంధుసరణి నీదు వర్తనమటులుండ
ముసలివైన నీకు బూజగు
టెట్లు? కానిబుధు లట్లువీడిరిగద
బమ్మవైననేమి? పద్మభవుడ!

విన్ననుట దోషము. ఏమనిన నీవంశక్రమమటులుండ నీకు మంచిగుణము లెట్లుకలుగును?

ఆ. వె. నళినసమితిమధ్య ॥ నడచుచునుండిన
కప్ప సౌరభంబు ॥ గాంచగలదె?
కీటకతతి నెల్ల ॥ గీటడగించెడు
నాల్క చాచికొనుచు ॥ నడచినట్లు.

మంత్రీ! నేనేమి సేయుదు.

మతి—రాజేంద్రా! గతించినదానికై వగువనేల? అయినను కర్తవ్యమూహింప పర్వతముల తలక్రిందవెట్టుకొని రాళ్ళకై పరితపించినట్లు దివ్యజ్ఞులు తమసన్నిధినుండ—

దృప—ఔనౌను (జ్యోస్యునిజూచి) ఆర్యా! నాకిక కర్తవ్యమేది? అనుకొనినసంబంధ మన్యథా జరిగినది.

జ్యోస్యు—రాజేంద్రా! నామదికి నాలోచించ పాండునందనులు మృతినొందినట్లు కాన్పించదు.

దుష్ట—కాక—

జ్యోస్యు—మనోవ్యథపడి దుష్టగ్రహము గ్రహించి వారు మారువేషధారులై యున్నట్లు గన్పట్టును.

మతి—ఆహా! అట్లైన బాగుగానున్నది.

దుష్ట—(తనలో) ఇది నిక్కమైన బాగుగా నుండును గదా!

జ్యోస్యు—రాజేంద్రా! ధన్వికిగాని యనన్యసాధ్యమైన మత్స్యయంత్రముజేయించి యత్యంతదుర్లభమైన ధనస్సును నిర్మింపజేసి యాధనస్సుతో విలుసంధించి క్రిందిగల దర్పణమున సభమునగల మత్స్యయంత్రమును గొట్టినవానికి సుకుమారినొసగి వివాహమొనరించెదనని స్వయంవరము చాటించుట బాగుండును.

దుష్ట—మహానుభావా! యోచనలేక మిక్కిలి దుఃఖితుండనై యుండునట్లు నన్ను అమృతనిభవచనముల శాంతుడనగునట్లు జేసిన యుష్మచ్చరణముల కొకనమస్కారము.

మతి—రాజేంద్రా! అటులొనరించిన తప్పక మనకోర్కె సిద్ధించును.
ద్రుప—ఆర్యా! పాండవులు క్షేమముగానుండిరని మీమనంబునకు దృఢముగా దోచుచున్నదా?

జ్యోస్యు—
చ. జలనిధులింకిన న్ధరణి ♣ చంద్రులు మార్గము తప్పిపోయినన్
జలజము చల్లనైన హరి ♣ శస్త్రము వాడిని దప్పిపోయినన్
కులగిరులెల్ల గ్రుంగినను ♣ కుంతికుమారులు సేమమన్న నా
పలుకులు కల్లలౌనె? కన ♣ బ్రహ్మలిఖంపును దప్పిపోయినన్

రాజేంద్రా! నావచనములు నమ్ముము.
ద్రుప—మామనములు మీవాక్యులు యదార్థములగుట కేకోరుచున్నది.
జ్యోస్యు—యదార్థములైనవే.
ద్రుప—ఓరోరీ! దుర్యోధన!

ఆ. వె. పాండుపుత్రవరులు ♣ భవనమందు మడసి
రనుచు ముదముగంటి ♣ వార్తయందు
నీదు చిత్తవృత్తి ♣ నిష్ఫలమగునంగా
భీముడుండు నీదు ♣ పీచమడప!

జ్యోస్యు—తథాస్తు అదియు యథార్థమగు.
ద్రుప—మంత్రిశేఖరా! ఈదివ్యజ్ఞునకు తగుబహుమానమిచ్చి పంపుము ఇక కొలువుచాలించి పగుప్రయత్నమున నుండెదను.
మతి—చి త్తము.

[తెర వ్రాలును]

## తృతీయరంగము.



ప్రదేశము—విపణిమార్గము.

[ప్రవేశము:—బ్రాహ్మణవేషధారియైన యర్జునుడు]

అర్జు—

సీ. శౌర్యపరాక్రమ | చర్యలు విడనాడి
ధైర్యహీనులరీతి | దనరవలసె
ధనువు శరముల చే | దాల్చు వదలి భిక్ష
పాత్ర చేనిండుగా | బట్టవలసె
దానధర్మంబుల దగ | నిడేడిచేయి
దానముల గొనగ్రింద | దనరవలసె
అతిథి యభ్యాగత | తతులగాచెడువారు
మధుకరవృత్తితో | మనగవలసె
గీ. పాండునృపవరసుతులమై | వసుధ బుట్టి
హరికి బావమరదుల | మయ్యు భవతి
భిక్షదేహి యటంచును | బిలువవలసె
తలప మాకెట్టి హేయదు | ర్దశ ఘటిల్లె.

కటకటా! యెట్టివారల మెంతవారలమైతిమి.

సీ. ఆరురుచులతిండి | నారగించెడువారు
గంజియన్నముదిన | గోరవలసె
హంసతూలికపాన్పు | నందుబండెడువారు
రిక్తనేలపయి ని | ద్రింపవలసె
కడుదరిద్రులనెల్ల | గాపాడువారట్టె
భిక్షుకులమగుచు | వెడలవలసె

వెలలేనిగంధంబ ♦ నలదెడు మేనుల
బూడిదనిట్టుల ♦ బూయవలసె

ఆ. వె. అస్త్రశస్త్రవిద్య ♦ లభ్యసించిన చేతు
లిట్లు భిక్షపాత్రి ♦ లెత్తవలసె
అతిసుకుమరు లిట్టు ♦ లలజడి బడవలసె
దైవరాయ నీకు ♦ దయయులేదె?

ఆహా! దైవమా! మాకెన్నటికైనను రాజ్యభోగములలవడునా? మాధర్మజుడు రాజ్యము బాలించునా? మేము మాయగ్రజుండు రాజ్యముబాలింప యనుచరుల మగుభాగ్యము మాకు కలదా? మాయమ్మ యెన్నటికైన సౌఖ్యపడునా? మాభీమసేనునకైన కడుపునిండ నన్నముదొరకునా? కవలు లిర్వురకు భిక్షుత్వము వదలుదినములుకలవా? (ఆలోచించి) అయ్యో! మేమెంతటి నిర్భాగ్యులము. అదృష్టవంతుడు మాలోనొక్కడైననుండరాదా? ఔరా! దుర్యోధనా! నీకెంతటిదుర్బుద్ధి కలిగినదిరా! పినతండ్రి బిడ్డలము— నీకప్రియమెన్నడు జేసియెరుంగము— నీయభివృద్ధిగోరు వారము— ఒరులనైన మనసునొచ్చుమాటలనాడి యెరుగము— అగు మాపై నీకింత వైరమా! తల్లినైన జూడవైతివి— విష్ణ్వంశ సంభూతుండగు కృష్ణునైన జూడవైతివి— ధర్మరాజు ధర్మమునైన జూడవైతివి— నీకింత కండకావరమా! వినాశకాలే విపరీతబుద్ధిః అనున ట్లొనరించితివి— ఔరా! (ఆలోచించి) ఏమి నామందమతి ధర్మప్రవర్తన నీకు విస్మృతమగునా?

ఆ. వె. నిశినిగోరు ఘూక ♦ నికరము భాస్కరు
తేజమెట్టులోర్చి ♦ దిరుగనోపు
పాదరక్షకొఱకు ♦ బరువులెత్తెడుకుక్క
చెఱకురసముదాగ్రి ♦ జేరగలదె?

(ఆలోచించి) నిన్ననసేల? మాకర్మమిట్టులుండె. ఏనాడేరిని భిక్షుకు జేసితిమో! నేటి కిట్లయితిమి. (ఆలోచించి) మరచితిని. కృష్ణద్వైపాయనవచనంబులు పొల్లులగునా? కొండొకకాలంబునకు ధర్మనందనుండు రాజ్యాధిపతియై ధర్మమునాలుగుపాదముల ప్రజల బాలించుననియె. మఱియు, రాజసూయాశ్వమేధాదిక్రతువుల సలిపి జగద్విఖ్యాతి గాంచుననియె- ఆమహానుభావుని వాక్యులన్నృతములగునా? కావు- తప్పక మాకెన్నటికైనన రాజ్యము చేకూరుగాని వ్యతిరేకమగునా? మాభుజబలశౌర్యములు రిక్తములగునా? ధర్మపాశమున గట్టబడిన నీపాండవ సింహంబులు విజృంభించిన వైరులు నిల్తురా? కష్టములు కలకాలముండునా? మాపాలిటిసుఖము మేమనుభవింపమా? కష్టము లేరనుభవింతురు? ధర్మరక్షణార్థమై యిట్టుల బాడబవేషధారులమైతిమి గాని లేకున్న విజృంభించిన మాకడ్డునిలుచువారెవరు? సత్యధర్మవర్తనుల కిక్కట్టులు దప్పవు.

[తెరలో] భవతి భిక్షాం దేహి!

(పరకించి) ఇల్లదే! మదగజగుంపు నిశాచరు బాడగాంచిన తమ్మిభంగి ముకుళితవదనుడై దీనత్వమున నెట్టుల భిక్షాపాత్రిగొని దిరుగుచున్నవాడో! కటకటా! యాచకవృత్తికన్న నీచకమేదియై నగలదా! నేనిట విచారించిన లాభమేమి? అచ్చట గృహము వారు తలుపుల దెఱచిరి. నేనరగి నాకృత్యము నెరవేర్చుకొనెద.

[నిష్క్రమించును]

ఇది చతుర్థాంకము





శ్రీదక్షిణా మూర్తయేనమః

# పాంచాలీ పరిణయము

## పంచమాంకము



(ప్రథమరంగము)

రంగము - భవనము.

[ఆసీనయై కుంతి. ప్రవేశము ]

కుంతి—(తనలో) కుమారులింకను బిక్షగొని రారైరి. ఏమికారణముననో నేడిట్లు తడవుజేసిరి. (ఆలోచించి) అయ్యయ్యో! నాకుమారుల కెట్టిదుర్దశ సంఘటిల్లె. ఓరీ! దుర్యోధనా! నీకెంతటి దురాలోచన బుట్టినదిరా? తమ్ములసుతులని యోధృతరాష్ట్రా నీకించుకైన ననురాగము లేదయ్యోగా! నామందబుద్ధి! నీకనురాగముండిన సుతులతో నన్ను వారణావతమున కంపెదవా? కటకటా! ధర్మము నమసిపోయినదా? ధర్మశాస్త్రకోవిదులు నశించిరా? పెద్దలు లేరా? మిమ్ములననుట తప్పు-

సీ. పినతండ్రిసుతులని ఁ ప్రేమించఁగోని సు
యోధనుడిట దోషి ఁ యనగరాదు
తమ్మునిసుతులని ఁ దాక్షిణ్యముంచని
ధృతరాష్ట్రు దోషిగా ఁ దిట్టరాదు

కౌరవులందరు ౯ గార్పణ్యమునను న్న
కూరులనుచువారి ౯ దూరరాదు
నీచకమైనట్టి ౯ యాచకవృత్తి ని
డిన నీరజోద్భవు ౯ ననగరాదు
ఆ. వె. ప్రాణవిభునితోడ ౯ బ్రాణముల్వీడక
సుతులపాటుజూచి ౯ శోకమొంది
బ్రతికియుంట నాదె ౯ బహుదోషమనిదోచు
నన్ను దూరనేల ౯ నవనియందు.

(కనులనీరునించుచు) అయ్యయ్యో ! కుమారులారా ! మీరింత నిర్భాగ్యులైతిరా! అయ్యో! నేనేమిసేయుదు- ఎవరితో మొరలి డుదు- మీరుపుట్టిననాటినుండియు నిక్కట్టులేనా ? కటకటా ! సౌఖ్యమనిన కలనైన మీకులేదుగదా! అయ్యో ! కుమారులారా! నేనేమిచేయగలను?

గీ. భోజరాజుకుమారినై ౯ పుడమిబుట్టి
ఘనుడుపాండురాజోత్తము ౯ కరిమువట్టి
శౌర్యధనులుపుత్రులగని ౯ శత్రులనిట్టి
గతినిజీవచ్ఛవంబుగా ౯ గాంచవలసె.

ఆ దెసనుండి భీమసేనుడు వచ్చుచున్నవాడు. నేనిట్లు విచారించుచుండిన నాకిండాగ్రహయత్తచిత్తుండై దుర్యోధనుని మడియింప నిప్పుడే యురుగుదునను. (కనుల దుడిచికొనుచుండును.)

భీము.—(ప్రవేశించి) అమ్మా! నమస్కారములు.

కుంతి—కుమారా! భీమసేనా! ఆచంద్రార్కము. సద్యశఃప్రకాశుడవై వర్ధిల్లుము.

భీము—(తనలో) నేడిటు ఖిన్నవదనయై యుండు హేతువేమైయుండునో గదా! అడిగి తెలసికొనియెద. (ప్రకాశముగా) అమ్మా!

ఆ. వె. చాలునంతభిక్ష ౪ సంపాదనములేక
నిట్లు వచ్చితినని ౪ యెంచి యిటుల
చింతనుంటివేమొ ౪ చెప్పుమా కతమేమొ
తల్లి నాపయి దయ ౪ జల్లివేగ!

లేక యెవ్వరైన నిన్నేమైననని రా? చెల్పుము. వారిశిరంబుల నిమిసంబున వ్రక్కలించివచ్చెద.

కుంతి—కుమారా! నాకేడ! విచారమేడ! అయినను మనవిధి యిటులుండె.

భీమ—అమ్మా! మనవిధికై నీవు వగువనేల?

ఆ. వె. జమునినైన మిగుల ౪ శ్రమల నుక్కించెడు
భుజబలంబు గల్గు ౪ పుత్రకుండు
భీముడుండ నిటుల ౪ బేలవై వాపోవ
నేలనమ్మ నింక ౪ చాలు! చాలు!

నన్ను విడువలసినదిగా నగ్రజునకు నచ్చచెప్పుము. తక్షణమే వైరిశిరకూష్మాండముల మదీయముష్టిఘాతమున వ్రక్కలించి నీకు నిశ్చింతగూర్చి సౌఖ్యము దెత్తును.

కుంతి—నాయనా! భీమసేనా! తొందరవలదు. తగుసమయము వచ్చువరకు వేచియుండుము.

[తెరలో కలకలము విచారము వినబడును]

భీము:—(ఆతురతతో) అమ్మా! ఆవిచారమేచ్చట?

కుంతి—(ఆతురతతో) మనగృహయజమానుల కెద్దియో విపత్తు చేకూరినట్లు కనబడుచున్నది.

భీము—అమ్మా! సత్వర నీవరిగి కతమేమో విచారించిరమ్ము

కుంతి—కుమారా! నే నటులనే యనుకొనుచుంటి— ధర్మార్జున నకుల సహదేవులింకను రారైరి.

భీము—వారల తోడ్కొనివచ్చెద, నిమిషములో వారలదుఃఖకారణ మారసెదమ్మ.

[భీముడు నిష్క్రమించును]

కుంతి—ఏకతమున వారట్లు వాపోవుచుండిరో కదా! కనుగొనియెదగాక.

[నిష్క్రమించును]

ద్వి తీ య రం గ ము

—*—

రంగము-విప్రగృహము

[ప్రవేశము-సోమయాజి,ధర్మశీల]

సోమ—కాంతా! వగవనేల? పుట్టుట గిట్టుట కేగదా! పుత్రికాపుత్రుల రక్షించుచుండుము నేనారక్కసున కాహారమయ్యెద. ఏమనిన

సీ. కానక కానక ✻ కన్నకుమారుని
బకునకు తిండిగా ✻ బంపగలనె
కాంక్షితుగను నెంచు ✻ దనయబ్రికార్థనె
బకునకు దిండిగా ✻ బంపగలనె
అర్ధాంగివైన ని ✻ న్నాదరింపక నేడు
బకునకు దిండిగాం ✻ బంపగలనె
ఇంటనన్నట్టివా ✻ రెట్టిబంధువులైన
బకునకు దిండిగా ✻ బంపగలనె
ఆ. వె. ప్రాణమైన విడిచి ✻ భార్యబిడ్డలనెల్ల
గాచువాడ గాని ✻ కమలగంధి
బ్రతుకగోరి మిమ్ము ✻ బకునిదరికిబంపి
నిలువగలనె చెప్పుమ ✻ నిమిషమైన.

ధర్మశీ—నాథా!

గీ. పురుషుకన్నముందు ॥ పరముజేరినసతి
సతియనందగు నిల ॥ సచ్చరిత్రి
పురుషహీనతగను ॥ వరపతివ్రతయైన
లోకదూష్యమందురి ॥ వీకబుధులు.

కావున పిల్లల మీరు సంరక్షించుచుండుడు. భవద్వియోగినినై యొక్కనిమిసంబైనను జీవింపనేర నేరితినేనియు నిక్కమాగల రక్షింపనేరను మరియు,

౩. వె. సతివిహీనయైన ॥ పతిపునఃపరిణయ
మొప్ప జేసికొనుట ॥ లొప్పుకొని
పతివిహీనయైన ॥ సతికదిదూష్యమై
తనరునందురిగాదె ॥ ధర్మవిధులు

మఱియు

ఉ. నాథుడు లేనిజీవనము ॥ నాథుడు లేనిసుఖంబుసంపదల్
నాథుడు లేనివైభవము ॥ నాథుడు లేనిగృహంబు భూములున్
నాథుడు లేనిభోజనము ॥ నాథుడు లేనిశుభంబు నామనో
నాథ! వృథాగదా ధరణి ॥ నాతికి సంపదలెన్నియుండినన్

సీ. కాలానలంబున ॥ గాలిగలనుగాని
వైధవ్యమున నెట్లు ॥ వగలగలను
తద్దయువిషమును ॥ దాగిగబోవుదుగాని
వైధవ్యమున నెట్లు ॥ వగలగలను
జడధియందుబడగ ॥ జనవచ్చునేకాని
వైధవ్యమున నెట్లు ॥ వగలగలను
కూరమృగంబుల కా ॥ హారమయ్యెదగాని
వైధవ్యమున నెట్లు ॥ వగలగలను

ఆ. వె. కఠినశూలధార ॥ కంఠంబువిదళించు
కొనగవచ్చు నూత ॥ గూలవచ్చు
చిత్రవధగ మేను ॥ చెండాడుకొనవచ్చు
వసుధవిధవనగుచు ॥ వరలగలనే?

నాధా! నామనవి నంగీకరింపు నన్ను కృతార్థురాలను జేయుము.

సోమ—కాంతా నేనెంత నిర్భాగ్యుడను

సీ. అతిభక్తితోడనా ॥ కనుదినంబును బూజ
సల్పినదానవు ॥ సఖియమిన్న!
అతిధి యభ్యాగ ॥ తతులబూజలసల్పి
సత్కీర్తిగొనినట్టి ॥ సఖియమిన్న!
అనపత్యభావంబు ॥ నందనీయక పుత్రి
సంతతిగనినట్టి ॥ సఖియమిన్న!
క్రతువులుసల్పిన ॥ కాలములందునా
సరసనునిలచిన ॥ సఖియమిన్న!

గీ. కనశరీరములెత్తింపగా ॥ గాలుచున్న
ప్రాణమొకటిగ దిరిగిన ॥ పడతిమిన్న
ఎన్నకనుగొన్న నిట్లు ॥ నేనిన్నపంపు
దన్న; నావంటి నిర్భాగ్యు ॥ డున్న అన్న

సీ. పాణిగృహీతవై ॥ వరలెడు నినునేడు
బకునకు తిండిగా ॥ బంపగలనె?
భార్యవనుచు నిన్న ॥ భరియింపలేకను
బకునకు తిండిగా ॥ బంపగలనె?
గృహిణివనుచు నిన్న ॥ గృహమునునుంచక
బకునకు తిండిగా ॥ బంపగలనె?

ధర్మపత్నివనుచు ॥ దయయొకింత లేక
బకునకు తిండిగా ॥ బంపగలనె?

ఆ. వె. పెండ్లియాడి ప్రాణ ॥ భీతిచే నిను నేడు
బకుని తిండికొఱకు ॥ బంపగలనె?
దంతితుల్యగమన ॥ దైవజ్ఞసుతగుణ
నీలజలదవాల ॥ చాలునబల!

అయ్యయ్యో! నిన్ను నేనంపజాల-

ధర్మశీ—నాథా! ఏలయీవిచారము?

ఆ. వె. వంశవృద్ధిగోరి ॥ పరిణయంబాడుట
లట్టిపుత్రకుండు ॥ బుట్టినాడు
భార్యవీడనిట్లు ॥ పరితపించగనేల?
నన్ను బంపుమింక ॥ నతగుణాఢ్య.

సోమ—కాంతా? నీవేగుట లొప్పుగాదు. నేనేగెద బాలురజూచుచుండుము.

ధర్మర—(ప్రవేశించి) తలిదండ్రులారా! నమస్కారములు.

ధర్మశీ, సోమ—కుమారా! చిరంజీవివై వర్ధిల్లుము.

ధర్మర—జననీజనకులారా! బకుని యాహారనిమిత్తార్థమునకు వంతువచ్చినదని వింటి. గావున నేనాబకాసురున కాహారమయ్యెద.

సోమ—(కౌగలించుకొని యేడ్చుచు) అయ్యో! కుమారా! చేతులారా నిన్ను నెట్లు బంపుదు నాయనా!

ధర్మర—పంపిననేమి? జననీజనకుల రక్షించుట పుత్రుల కర్తవ్యము. మఱియు నేనరిగినను మీకు నావంటి తనయుని భగవంతుడనుగ్రహించి మీకీయరాదా! నన్ను భగవంతుడు మరలమీగర్భంబున జన్మంబొసంగునట్లు జేయరాదా!

సోమ—(విచారించుచు కుమారునిశిరము మూర్కొని) అయ్యయ్యో! నాయనా! నిన్నటులంపిన—

సీ. అమృతరసమ్ములొలుకు | నటుల నాన్నాయని
యింక పిలచెడు పుత్రు | డెవడు కొడుక?
అడుగడుగునకు నా | కతిభక్తి సాధంబు
లింక నొత్తెడు పుత్రు | డెవడు కొడుక?
చిఱుతిండికొఱకు | నను జేరి దబ్బిమ్మని
యింక నన్నడుగు | పుత్రు డెవడు కొడుక?
అమ్మతిట్టెనటంచు | నక్క కొట్టెనటంచు
నిక నాకు జెప్పువా | డెవడు కొడుక?
గీ. కొడుక! నాపాలిభాగ్యంపు | పుడుకుదుడుక!
నిన్ను విడనాడి నేనొక్క | నిమిషమైన
నిలువలేకున్న ఇంక నే | పలుకులేల?
బతుకితండికి నిన్ను నే | బంపజాల.

ధర్మర—(తల్లినిజేర) అమ్మా! నీవైన నాన్నకు నచ్చచెప్పరాదే.

ధర్మశీ—(కుమారుని కౌగలించుకొని కన్నీరునించుచు) నాయనా!

ఉ. నోముల నోచినోచియు న | నోకహసంతతి మ్రొక్కిమ్రొక్కి వే
బాముల జిక్కి చిక్కకడు | వార్ధులనన్నిట మున్గిమున్గి సు
స్వాముల గొల్చికొల్చి యుప | వాసశతంబులు జేసిజేసి యా
కామసమానరూపు నిను | గంటినిసుమ్ముల పుత్రరత్నమా!

నిన్నెట్లు ముక్కడిరక్కసునకు దిండిగా బంపగలుగుదుము నాయనా!

ఆ. వె. పుత్ర! నీవెటులొ | పోలసిన పున్నామ
నరక మాటు మేము | తరణమొంద

గలము? నీవు మమ్ము ॥ గాచెదవను కొని
పుట్టెడాసతో నెడ ॥ బొంగుచుంటి.

**సుమతి**—(ప్రవేశించి) జననీజనకులారా! వందనములు.

**సోమ, ధర్మశీ**—పుత్రీ! చిరంజీవినై వర్ధిల్లుము.

**సుమతి**—జననీజనకులారా! మీరేల యిట్లు చింతించెదరు? నేనాబకాసురున కాహారముగా నరిగెద. పెద్దలు మీరలేగిన మేము పిన్నవారలము. నిలువలేము- ఏరికైనను తలిదండ్రులుండినగదా! సుఖము-మీరు లేకున్న మేముబ్రతుకుటఎట్లు? తండ్రియేగినమనకు దక్షుడెవరు? కావున నాతండ్రి యిటనపరిశస్తుడు జనయిత్రి యరిగిన మమ్ముల సంతరించువారెవరు? ఆపెయు నప్రశస్తురాలు - తమ్ముడేగిన మనవంశము నిర్వంశముగదా! ఆవంశోద్ధారకుండైన తమ్మునంపుట తగదు. నేనన్ననో అవివాహితను-నేనరిగిన గర్భవాసవశమ్మున మీకు దుఃఖముండినను ఎవరికినిహాని లేదు. మఱియు, నాకిక పరిణయమొనరింప నెంతకష్టము- గావున నన్నను గ్రహించి నామనవి మన్నింపుడు.

**ధర్మశీ, సోమ**—(కుమారినిచేరదీసి నేడ్తురు)

**కుంతి**—(ప్రవేశించి) అయ్యా! మీవిచారకారణమేమి? సంశయమొందక నాద్యంతము సత్వర దెలుపప్రార్థించుచుంటి

**ధర్మ**—అమ్మా! ఏమనిజెప్పుదు? దీనినెవరు దీర్పసమర్థులుగారు. అయినను జెప్పెద. ఇచ్చట కామడదూరమునన్న యమునానదీ గహ్వరమున బకుండను రక్కసుండు గలడు అతిదమితభుజబల సంపన్నుడు. అతడీపురవాసుల నందరిని మ్రింగుచున్నవాడు. అంత గొందరతని బ్రార్థించి నిత్యంబు నిలువయిన నొక్కొక్క-మానిసియు, రెండెనుబోతులం బూన్చినశకటంబున నపరిమితభక్ష్యపిశితమిశ్రాన్నంబు నించుకొనిపోయిన దానిని, వానిని,

నమ్యోనుబోతులు భక్షించుచుండును. నేటికీలువరుస నూకు వం
తువచ్చె ఇదియే విచారకారణము.

కుంతి—అయ్యయ్యో! పాప మెంతయిక్కట్టు సంభవించినది. అమ్మా!
అప్పసితాసిని బరిమార్చు నృపులు లేరా?

ధర్మశీ—ఉండిన నింతదుఃఖమేల? రక్కసున కెఱయగుదునన విభునివీడ
లేక సంతతివీడలేక నేనరుగదలచిని.

సోమ—అమ్మా! న్యాయమునీవుజెప్పుము. ఎంతటివారైనను భార్యబిడ్డ
ల నిట్లు రక్కసున కాహారార్థము బంపి సుఖించనెంచునా? వీర
లరుగుటతప్పుకాదా! నేనేయరుగుటకు దోషమేమున్నది?

ధర్మర—అవ్వా! తలిదండ్రుల రక్షింపలేని తనయుడెందులకు? నేనిందు వీ
రని రక్షింప రక్కసుని కాహారమగుట దోషమేమికః దు!

సుమతి—అమ్మా! న్యాయమువిచారించి చెప్పుము. ఈఆతడు నాతండ్రి
ఈమె నాతల్లి ఈతడునా... దగుకు వీరిలేనిన సంసారమునకు దప్ప
క లోటుచేకూరును నేనపివాహితను నేనరిగినకొదువయుండదు

కుంతి—అయ్యా? మీరందరటుల వాపోవతగదు. మీచింత నివారించె
ద ఊరకొండు—

అందరు—(ఆశ్చర్యమున జూతురు)

సోమ—అమ్మా? నీవెట్లు మాచింతను బాపెదవు

కుంతి—మీచింతనుబాపు యోచనము లేదా!

గీ పుత్రు లేవురు నాయందు ? బుట్టినారు
కాన నొక్కని మిమ్ముల ? గావనెంచి
బకునికి నాహారముగ నేను ? బంపుదాను
చింతపడనా మడింక మీ ? చిత్తములను

సోమ—అయ్యయో! (చెవులుమూసుకొని) ఇట్టివిపరీత మెచ్చటనైన
గలుగునా? అదితిథియై వచ్చినబ్రాహ్మణోత్తముని జీవితార్థమై

రక్కసునివాత ద్రోయ నేనెట్లు లొడంబడుదు విప్రమరణ మతి పాతక హేతువుగదా!

క. ధృతిసెడిపీడెడువానిని
నతిథిని నభ్యాగతిని భయస్తుని శరణా
గతుజంపుట కొడవడుదు
ర్మతికిహాముంబరముగదే మదిపరికింపన్

మఱియు నాత్మవధ మహాపాతకంబు దానికొడంబడితివాటి వేని నదియ నతిక్రమణీయంబై యొరులచేతం జేయంబడుట జేన నాకుం బాతకంబు లేదు దానిని జేసినవానికి మహాపాతకంబు సిద్ధించును.

కుంతి—ఆర్యా! నేనును దానిని విచారించియే విప్రవధ సహింపలేక నా కుమారుని సమర్పింపనెంచితి నాకుమారు వధింపగ నేనైన నశక్యంబు కాదు.

గీ. ఖలుడు రక్కసు మడియించు బాలుడగుచు
కాన నిట్టుల బుత్తెంచ గడగుచుంటి
సూనశతముగల్గిన ప్రాజ్ఞ సుదతికైన
నందునొక్కని ననహితంబు డగునె! చెప్పుమా

నాసుతునిచేత బెక్కండ్రు రక్కసులు మ్రగ్గిరి [illegible] ఘనపరాక్రమసంపన్నుడు. మంత్రసిద్ధుడు.

సోమ—ఎంతమంత్రసిద్ధుడైనను రక్కసునకు [illegible] సమ్మతించెదనా?

కుంతి—తప్పక సమ్మతింపుడు. అయిన నాపుత్రుని గనపఱచెద రండు.

ధర్మశీ—నాథా! ఆమహా బలసంపన్నుడెట్టివాడై యుండునో గనెదము రండు.

సోమ—అట్లయిన నడువుడు విచారింతము.

[అందరు నిష్క్రమింతురు]

కుంతి—ఎంతదుర్మార్గుడైన కుమరుడు తల్లి కనిష్టుడగునా? నాయనా! నావచనంబుల బ్రశాంతుండవై వినుము. బకుండను రక్కసబాధచే నీపురివాసులు బహుదుఃఖితులై యుండిరి. బ్రాహ్మణప్రాణరక్షణార్థము నేభీమసేనుని బలపరాక్రమములు మీరెరుంగరని నెరింగియుంటిని. గనుక నటుల బంపితి.

ధర్మ—అమ్మా! మేమెరుంగని బలపరాక్రమము లేవిగలవు?

కుంతి—కుమారా! భీమసేనుని బలపరాక్రములు మీకెవ్వరెరుంగుదురు కాని నేనాతని జన్మసమయమునందే యెరుగుదును.

ధర్మ—తల్లీ! ఆవిశేషంబు నాకు చెల్పుము.

కుంతి—భీముండు వజ్రకాయుండు వజ్రినైన గెలువనోపునట్టి సమర్థుండా రక్కసుని నిముషంబున బొలయించగలడు. దృఢనిశ్చయమునాకు గలదు అదేమంటివేని భీముడు పుట్టిన పదియవదినంబున నేనాతని నెత్తుకొని శతశృంగధరాధరశిఖరంబునుండ నాచేతినుండి భీముడు జారి గిరిపైబడియె

ధర్మ—అయ్యయ్యో! అప్పుడేమిజరిగినది?

కుంతి—ఏమయినదని చెప్పుదు నా బాలకుడు పడినస్థలము నాశ్చర్యముగ పిండియైనది

ధర్మ—ఎంతవిపరీతము!

కుంతి—ఇట్లు తెలసియుండియే బంపితి పవననందనుని పంపుటకు నీకుసంతాపంబువలదు మనకు సుఖనివాసంబునిచ్చి పరమోపకారియైన యాబ్రాహ్మణునకు బ్రత్యుపకారము సేయ భగవంతుడు నేటికీ యదను సమకూర్చెనని సంతసము నొందుచుంటి

ధర్మ—మారుతి తిరిగివచ్చినగదా! సంతసము

కుంతి—కుమారా! హరిహరాదిసురులడ్డమైన నాతనికి ప్రాణభయముండదు.

ధర్మ—అటులైన సంతసమేకదా! పరోపకారార్థముపాటు పడుట నాకు
ను సమంజమే కాని ప్రాణహానియగునని దలచి నేనటులంటి మ
ఱియు నాతని నాధారముగజూచుకొను మనకాతనిబంపిన మన
గతి యేమియని దలంచితిని.

కుంతి—నాయనా! కలయందైన భీమునకు ప్రాణభయము వచ్చునని
తలంపవలదు.

ధర్మ—జననీ! అర్జున నకుల సహదేవు లింతతడవున్నకైన రారైరి. భీము
డటుల నసురిని జంపనరిగె. మనముత్తరపడుచున్నది.

కుంతి—

ఆ. వె. ఏను సాధ్వినైతి నేనియు మాతండ్రి
జనతతి నాతసత్య సంధుడేని
పవనసందనుండు ప్రాణభయములేక
అసురుగూల్చివచ్చు నమితకీర్తి!

ధర్మ—అమ్మా! అటులైన వారలరాక జూతమురమ్ము

కుంతి—కుమారా! నడువుము [ఇరువురు నిష్క్రమింతురు]

—*—

చతుర్థాంకము



రంగము-యమునానదీప్రాంతము

[ప్రవేశము- బకాసురుడు]

బకా—(తనలో) ఏమీ! ఈయేకచక్రపురవాసుల మదోన్మత్తత అవిర
సనము ఆయొడలువిరుపు-కాకున్న నేడు మూడుయామములు కా
లముజరిగిన నాహారము బంపరైరి నాభుజబలంబు మరచిరి నాచ
ర్యలు స్వప్నతుల్యములైనవి. నా కరుణాకటాక్ష వీక్షణములు

నాకొంప ద్రివ్వినవి. లేకున్న వీరల నందరి నొక్కమారు
క్కడించి చక్కగ మెక్కియుండనా- వారలప్రార్థన మంగీకరిం
చిన హేతువుచే దయాధర్మబిక్షమైనది నాకు యొడలు మండు
చున్నది. కోపాగ్నిదహించుచున్నది తాపమాపుకొనలేకుంటిని ఇక.
నరిగెద ఒక్కమారుగా యేకచక్రపురవాసులపీచమడచి నాక్షుద్బా
ధదీర్చుకొనెద. ఓరోరి!నక్తంచరులారా! రండు దండు వెడలుడు.
మీకు కడుపునిండ భోజనము గలుగజేసెద.

[తెరలో స్వామి! బండివచ్చుచున్నది కొలదిదూరములోనున్నది]

బకా—(పరికించి) బండెడన్నమునకన్న నేమియు గనబడుటలేదు. మను
జు డెచ్చటనుండెనో యదృశ్యుడుగనుండె ఎనుబోతులెట్లు పెం
డ్లినడకలు నడచుచు వచ్చుచున్నవి నేనరిగి వానిని చిత్రవధయొన
ర్చి బక్షించెద [నిష్క్రమించును]

వృకోదరం—(ప్రవేశించి) ఆహా! ఎంతవేగముగా మాయధిపతి పరుగెత్తు
చున్నవాడు (జూచి) ఔరా! ఆగ్రహముచే నానరాధముని కో
క్కపాదప్రహారణ మిచ్చెను చచ్చినాడు! సరున కింతకండకావ
మా! కనుతెరింగి మసలుకొనవలదా! తగరుపొగరు ధరాధరము
కడనా? వహ్వా! వహ్వా! బాగుగా జరిగినది (చూచి) అయ్యో
మాయధిపతి నెట్టుల నరుడు దాకవచ్చుచున్నవాడ! ఔరా! ఏ
మిరా ధైర్యము సముద్రోదకంబుల తీతువ పీల్చనుద్యమించున
ట్లు నీవా! మాయధిపతిని బొలయించువాడవు

[తెరలో రక్కసులారా! సత్వర రండురండు! నాకుతోడుపడుడు]

ఓహో! ఈతండెవ్వడో ఘనునివలెదోచుచున్నవాడు మాయ
ధిపతిని ముప్పతిప్పల బెట్టుచుండె (పరికించి) అదిగో ఇరుపురు
బోరాడుచు నిటు వచ్చుచుండిరి అయ్యో! అయ్యో! మాఅధిప
తి దివికేగినాడు మమ్ముల విడినాడు మాకేదిదారి మమ్ములను వి

డు జమునివీటికి నంపునేమోగదా! కటకటా! రక్కసులెల్లు పరు
గులెత్తుచుండిరి! ఏమి! ఈనరునిదోర్భలము

[తెరలో]

ఆ. వె. అబ్ధినోదగియున్న ॥ నవనిదాగినగాని
నభముదూరియున్న ॥ నమ్ముడింక
మిమ్ము వెంబడించి ॥ మేదినీతలమెల్ల
శాంతిగూర్పనింక ॥ సంహరింతు

ఓరోరినిశాచరాధములారా! ఎచ్చటకేగెదరు నిలువుడు నిలువుడు
పూరిపోకు డిదియాశౌర్యము మీయధిపతిని గనుబరుప దివికం
పెద రండు రండు!

వకద్రం—అమ్మయ్యో! ఇదుగో ఇతడిట్లువచ్చుచున్నవాడు. నేనెందు
బోవుదు! నాకేదియు దారిదొరకుటలేదు. ఎటుబోయిన నయ
స్కాంత మినుము నాకర్షించుచున్నట్లితడు నన్నాకర్షింపకమాన
డు. నాకు సమరమొనర్ప శక్తిచాలదె. ఏమిచేయుదు-అయ్యో!
తల్లికి నొక్కడనే కొమరుడనైనను, నాప్రాణమునాకెంతబెల్లమై
నను ఈతడు నన్ను విడచునా? శరణార్థినని మొద - రక్షింపుమని
మొద ఎటులైన నాతనిదయయే మహాప్రసాదము.

భీము—(ప్రవేశించి) ఓరోరి! నిశాచరులారా! నిలువుడు! నిలువుడు
ఎందుబోయెదరు.

వక్ర—అయ్యా! రణభీమా! యశోవిశాలనామా! శరణార్థిని రక్షించు
ము. తమబోటియుత్తమవీరులకు నాబోటిభీరవుల రక్షించుట
పరమధర్మము.

భీము—ఓయి! నక్తంచరుడా! ఈదినమునుండియు మీయధిపతిగతి నర
మాంసభక్షణము సలుపక సద్వర్తనగ సంచరించెదనని శపథ
మొనర్చిన నిన్ను గాచెద.

వక్రి—అయ్యో! మీపాదములసాక్షి! మీయాజ్ఞ దాటువాడనుగాను. రక్షింపుడు.

భీము—రక్షించితినిబొమ్ము (పరికించిచూచి) నిశాచరాధములారా! నిలువుడు! నిలువుడు. మీప్రాణములపై యాశగలిగెనేని శరణార్థులమనుడు. లేకున్న మీప్రాణములు మీకుదక్కవు.

[నిష్క్రమించును]

వక్రి—అమ్మయ్యో! నాప్రాణములు కుదురుపడినవి. నేనుబ్రతికితిని. ఇంకెవ్వరు వచ్చిననాకేమి? ఈగండము గడచినది. మఱలనాతని కంటబడకుండ నరిగెద.

[నిష్క్రమించును]

ఇది పంచమాంకము



శ్రీదక్షిణామూర్తయేనమః

# పాంచాలీపరిణయము



## ప్రథమాంకము.

రంగము—హిమవనము.

[ప్రవేశము—వ్యాసుడు]

వ్యాసుడు—

శ్లో. పునరపిజననం | పునరపిమరణం
పునరపిజననీ | జఠరేశయనం
ఇహసంసారే | బహుదుస్తారే
కృపయాఽపారే | పాహిమురారే ॥భజ॥

తలచిచూడ సంసారనివృత్తికి భక్తిమార్గమె యత్యుత్తమము అట్టిభక్తిమార్గములేక మాయాప్రపంచకమును నమ్మి అహంభావము ననుసరించువారలెందఱుగలరు?

శ్లో. కస్త్వంకోఽహంకుతఆయాతః
కామేజననీ! కోమేతాతః
ఇతిపరిభావయ నిజసంసారం
సర్వంత్యక్త్వాస్వప్నవిచారం ॥భజగో॥

# పాంచాలీ పరిణయము

ప్రతిజీవియు నాకంటె వేరుగానుండెడు నీవెవడవు? నీకంటె వేరుగానుండెడు నేనెవడను? మనమెచ్చటినుండి వచ్చితిమి? నాయొక్క తలిదండ్రులెవరు? ఈవిధమున విచారించిన స్వకీయమైన సుతాదుల నందరివిడచియుండిన స్వప్నమందుగనిన పదార్థములు లోగల మిథ్యాజ్ఞానమువలెనే యని తలచి తత్వజ్ఞానమొనరించు కొనవలయునుగదా! (తెరలోధ్వనిఆలకించి) పాండవులు ద్రుపదపురమున కరుగుచుండిరి- పాపము వీరినిజూచిన విచారమును సంతసమును గలుగుచున్నది. దుర్యోధన వంచితులగు విచారమును శ్రీకృష్ణరక్షితులని సంతసమునుగదా! రేపటిదినంబున ద్రౌపదీస్వయంవరముగదా! వీరి లాపురి మీరేయి యరుగు నట్లానగూర్చెద. తప్పక వీరలకు శుభమగు వార్తకునూరించం ద్రులు క్షేమాగమనంబు నిరీక్షించిన వైరి సనసంతతులు తప్పక తలలువంచకమానవు. ధర్మమార్గ చరుల నిందముల బెట్టెదం చువారికే యిడుములు ప్రాప్తించునను పలుకులు నిక్కమగునటకు బాండవులే నిదర్శనులు. ఇక నేజాగుసేయక వారలుద్రుపదపురంబున కరుగుటకు బురికొల్పెద.

[నిష్క్రమించును

(ఇది విష్కంభము)

నాపతిగాంతునో? గననో ॥ నావిధి యెట్టులనుండెనో
పాపపుదైవమా! యబల ॥ బాటులబెట్టగనీకు ధర్మమేగదా!

సీ. అందు నాతండ్రితో ॥ నయ్యర్జునునిదక్క
నన్యనృపుల గో ॥ రననుచు నేడు
విందునా పాండవు ॥ ల్విచ్చేసిరనుమాట
చెవులకు బండువు ॥ చెలగు నేడు
కందునా! ధన్విమ ॥ ఖేందుబింబంబు నీ
కనులతో నుత్సా ॥ హమునసనేవు
చెందునా? ఫల్గును ॥ చెలియనయ్యెడు భాగ్య
మిలనోనర్చిన నోము ॥ ఫలితమొప్ప.

గీ. మందునా? భువినరుని ॥ మగువగాక
మ్రిందనా? కోర్కె వేరుగా ॥ మారుచున్న
తిందునా? తండ్రి భర్తను ॥ జెందకుండ
కుందనా? ధన్విగోరని ॥ కూర్మనయము

[తెరలో అక్కా! ఎచ్చటనుంటివి! నీకొఱకై మహా
రాజుగారు నన్నంపిరి]

ద్రౌప—అయ్యో! నేనేమిసేయుదు? చెలివచ్చుచుండె నాతండ్రి నా కొఱకై వేచియుండెనట. దైవమా! అతడన్యథాభావించి నాకొఱకు వర్తమానము బంపియుండినోపు.

భీమ—(ప్రవేశించి) అక్కా! నీవిట నిక్కరణి దీనావనవై యుండగ తంబేమి? లోన మహారాజుగారు నీకొఱకై పరితపించుచుండిరి సత్వరరమ్ము

ద్రౌప—సఖీ దీనురాలకు దీనానత్వముగాక-

భీమ—ఔనౌను! సఖీ విచారించిన నేమిలాభము దైవకృపను నెరవేరదా?

గా్రిప—నెర వేరకుండిన నేమిచేయుదు.

భ్రీమ—నెర వేరకుండునా? తప్పక నెర వేరును.

దా్రిప—ఎట్లు చెప్పగలవు?

భ్రీమ—అన్యున కశక్యమైన మత్స్యయంత్రభేదనమున.

దా్రిప—ఈశ్వరాజ్ఞ ఎట్లున్నదో? ఎవరికి దెలియవశము.

భ్రీమ—తెలియవలసినదిదివరకే దెలసెను– ఇక నాతనిరాకయే.

దా్రిప—వచ్చునా!

భ్రీమ—రాకయుండునా!

దా్రిప—వచ్చిరనువార్త వింటిసినదా!

భ్రీమ—రేపటికైన దెలియదా!

దా్రిప—సఖి నీకుదెలసిన దెలపి నామనోశాంతి యొనర్పరాదా

భ్రీమ—అక్కా! నీకడనా నాదాపరికము– నాకు దెలసిన దెలుపనా?–
అతనిభావమరది శ్రీకృష్ణుడు వచ్చియున్నవాడట అతనిసేవింప నందరు నరుగుచుండిరి

దా్రిప—అందులకా తండ్రిగారిఆందోళనము.

భ్రీమ—అందులకే ఆమహానుభావుని పూజసల్ప నెంచి.

దా్రిప—ఆమహానుభావుని దిలకించితివా?

భ్రీమ—ఆ! చూడకేమి?

దా్రిప—అతనివెంట నీప్రాణ—

భ్రీమ—అతనివెంట "నీ"వనుచున్నయాతడులేడు కాని హాలము మూపునబూని యుండిన నొకపాంథుడుమాత్రముండె

దా్రిప—సరి! మనమతని సేవింపనరుగుదమురమ్మా!

[ఇరువురునిష్క్రమింతురు]

—*—

## ద్వితీయ రంగము



రంగము—సభాభవనము

[ప్రవేశము—దుర్యోధన, కర్ణ, శల్య, జరాసంధ, శిశుపాల ముఖ్యధరాపతులును, శ్రీకృష్ణ బలరాములును, బ్రాహ్మణులును, పాండవులును, ద్రుపదుడును, దృష్టద్యుమ్నుండును, ద్రౌపదియు, ఉపవిష్టులైరి]

దృష్ట—(నిలువబడి) ఓనృపోత్తములారా! మదీయవిన్నప మాలింపుడు

ఉ. అల్లదె మత్స్యయంత్రము వి ॥ హాయసమందునను౦డె దాని నీ
విల్లున పంచబాణముల ॥ వీక్షణలక్ష్యముగ్రిందనుంచి యే
మల్లుడు త్రెళ్ళజేయు నల ॥ మత్స్యనకిచ్చెద నాదుచెల్లెలీ
ఫుల్లసరోజనేత్రి వర ॥ పూర్ణసుధాకరవక్త్రభార్యగాన్.

సోదరీ! భూపతిపుంగవుల నాయనునికర భూసురోత్తముల నవలోకింపుము— వీరలలో నామత్స్యయంత్రభేదనము నేజెప్పిన నియమములచొప్పున నెవనికి శక్యమగునో వానిని వరునిగా భావింపుము. ఈకుసుమమాల నాతనికంఠమున వేయుము. (కుసుమమాల ద్రౌపది కిచ్చును.) ఆతావున నిలచి చూతము రమ్ము.

ద్రౌప—చిత్తము. (మాలగొనును) [ఇరువురు నిష్క్రమింతురు]

దుర్యో—మిత్రమా! కర్ణా! లెమ్ము! లెమ్ము!

చ. అలవియె మీనయంత్ర ॥ మిల వన్యులు గొట్టగ నీవుదక్క నా
పలుకుల నమ్మనుమ్మ సుద ॥ పారణనిర్జతయానమెచ్చి ని
న్వలచుట నిక్కమమ్మజియ ॥ వాంజమందిరనీజెసొమ్ము నీ
బలము నెరుంగనె? ఇక శు ॥ భంబౌనగూడును సూతనందనా.

బలరా—తమ్ముడా! శ్రీకృష్ణా! ఇందీమత్స్యయంత్రము గొట్టుకర్త ఎవ్వ రైన నుండెనా? అని తలచుచుంటి.

ఆ వె. అస్త్రవిద్యయందు నధిక కుశలుడగు
జాలువాడు ధన్వి సందియంబె?
అట్టివాడు మనల నవనీస్థలివిడచి
దివికిజేరెనాడు దీనునిగతి.

పాపము! ఆపాండవమధ్యముడుండిన నీయంత్రభేదనమనగా నెంత?

కృష్ణు—అగ్రజా! వారలవృత్తాంతము దెల్పెద- నాపంకనాజయద్రథ బృహద్రథ సత్యవ్రతా చిత్రాంగద శుభాంగద భగీరథ భగదత్త ముఖనానాదేశాధీశు లెట్టులాధనస్సుకడ కరుగుచుండిరో!

శిశు—(తనలో) ఏమి యాకన్యకామణి సౌందర్యము!

గీ. పడతిగాదిది బంగరు ప్రతిమగాని
ప్రతిమగాదిది మల్లెల బంతిగాని
బంతిగాదిది మేఘజ ప్రభయెకాని
ప్రభయుగాదిది చిత్తవి భ్రమముకాని

సీ. షట్పదంబులపత్రి సమితియా! కాదల
కాలనీరదముల చాలేమొ
షట్పదమిధునమా సరణిజూడగగాదు
వాలాయముగగండు మీలు వేమొ?
షట్పదసంతతి సహజవైరియు కాదు
పనగలింగనతిల కుసుమేమొ
షట్పదగుణధృత శరనికరములెకా
వలవాడిగలిగిన ములుకులేమొ

గీ. నెరులు గన్గవనాసంబు జుగుకుచూపు
లహాహా! ఇన్నాతిగూడిన యతినిజస్మ

జన్మమనదగు! కాకున్న ‡ సార్థకంబె
ముక్కుబిగబట్టి జపియించు ‡ మునికినైన!

నాజన్మమే జన్మము.

చ. గురుతమమైన యంత్రమును ‡ గొట్టగజాలిన శక్తివంతుడీ
ధరణిగలండె నేనొకడ ‡ దక్క తలంప మురారికినైనని
ర్జరపతికైన శంకరుని ‡ శక్తికినైనను శక్యమౌనె యీ
నరవరముఖ్యు లిచ్చటను ‡ నాలినిగైకొన జోడులౌదురే

ఈభాగ్యము నాకేదక్కు చూచుచుండెద

జరా—(తనలో) ఈనృపాలులందరు మిన్నకుండిరి ఆచోటనాతుంటరి నల్లనల్ల యేదియోతెనయున్నతో గుసగుసలాడుచున్నవాడు- చల్ల కొరకువచ్చి ముంతదాచినట్లు నేనిట్లూరకొనటయేల? నేనరిగి యీయంత్రము ఛేదించి గోలాక్షి గైకొనెద

దుర్యో—మిత్రమా! జరాసంధు డరుగుచున్నవాడు- మనమచ్చటి కరుగుదమురమ్ము

కర్ణ—ఔనచ్చటికేగుదము [నిష్క్రమింతురు]

కృష్ణు—(తనలో) ఈశిశుపాలు డెందులకో యిచ్చట నిరీక్షించుచున్న వాడు కొంచెమాతని బుఱకొల్పెద (ప్రకాశముగా) బావా! శిశుపాలా! నీశక్తి నేనెరుంగుదు నీవె ఈయంత్రము గొట్టగల సమర్థుండవు ఏల విల్లంబించుచుంటివి!

శిశు—నీవనవసరప్రసంగమొనర్చినను నీపలుకు లుపకరము- నీ చేటనెద్దవాడవుకావు- నీవ శక్తి యేదియులేదు నా శక్తి నాకు దెలియును. నే లిసి యు జిన నిట్లు మాటలాడుదువా! అయినను నీశక్తికి మత్స్యయంత్రభేధనము కలదో విమారు కనకనే యిట్లు సిగ్గుమాలి మాటలాడుచుంటివి.

కృష్ణు—(నవ్వుచు) బావా! నీయొక్క విజయము గనవచ్చితిగాని నా యొక్క శక్తి గనబరుపరాలేదు.

శిశు—చాలు! చాలు! సిగ్గువదలియిట్లు మాటరాడ నీనోరెట్టులాడె? నీకుశక్తియుండినకదా మత్స్యయంత్రభేధనము.

కృష్ణు—బావా! నీకంతకోపమేల? నాశక్తి నీవే యరుంగుదువు

శిశు—నీశక్తి యెరుగకయేమి? ఆహా! అఱచేతియాభరణమున కద్దము కావలెనా?

గీ. మిసిమిముద్దుల హారింయించి ( మిగుటొకటి
గొల్లబోట్టల బలిమిని ( గూడుటొకటి
వరుసవావుల నెరుగక ( వరలుటొకటి
పోల్ప నీశక్తి మించెను ( పోగడగలదె

కృష్ణు—అగునగును; నాశక్తి బాగుగా నెరుగుదువు— నీకింతకోపమేల

శిశు—నీకుమాత్ర మంతకోపమేల! ఉన్నసంగతుల జెప్పితిని

కృష్ణు—ఉన్నవి కొన్నిటిమాత్రమే నీవెరుంగుదువు కానియన్ని నెరుంగ లేవు

శిశు—అన్నియు నెరుంగుదు కొన్నిసంగతులేల? తల్లిపుట్టిసిల్లు మేనమామకెరుకయా?

కృష్ణు—నీశుభమును గోరి పలుక నీవిట్లు లుకుకుట నేల!

శిశు—ఉడుకులు లేవు, అశక్త దర్పాన్వయము

కృష్ణు—ఎవరికి?

శిశు—ఇంకెవరికి? నీకు

కృష్ణు—ఎందుకు?

శిశు—యంత్రభేధనమొనర్చి యుబలగొన్న నై తిమి కాదుగదాయని

కృష్ణు—నీవిజయమని నమ్మియున్న నాకాదుర్దసత్వమేల?

శిశు—ఎందులకా!

గీ. తొలుత నాకిత్తునన్నట్టి । చెలువ నీకు!
చెల్లెలైనను గానీకు । చెల్లినట్టు
లిచట హరియింప జిక్కని । హేతువునను
శక్తిదుర్జనస్వామి కాక । శక్తికలదె!

కృష్ణు—నాతో వినోదమునకై మాటలాడిన నీకింత కోపమెందులకు? నీతో మాటలాడనులే.

శిశు—నాతో మాటలాడవలసినదిగా నేప్రీతిమా లేదు.

[తెరలో]

గీ. యమునామీనము గొట్టగ । నలవిగాక
నల జరాసంధకర్ణాదు । లరుగుచుండిరి
లేర యీయంత్రముసుగొట్టు । శూరవరులు
కువలయాధీశ! శూరులు । గొడ్డువడిరె!

శిశు—ఇంతలోనే శూరలోకములు గొడ్డువడెనా! నేను వచ్చుచుంటి.

[అరుగును]

గోప—(ప్రవేశించి తనలో) ఆహా! ఇంతటికైన విజయుండు రాడయ్యెగా! ఏమినాపాపము - ఏమినా నోచిన నోముఫలము - ఏలనా జన్మము- ఇంకేల నాబ్రతుకు?

గీ. వంచిన విగుంజు నేఁడైన । వచ్చునటంచు
నాశగొంటిని కటకటా! । యట్టియాశ
నిరధిముగ్నె నాకెద్ది । దారియింక
భానుభవనాశ ! త్రైశ । పార్వతీశ!

అయ్యో! నేనేమి సేయుదు. (విచారించుచుండును)

[తెరలో]

ఆహా! ఇంతదాఁక వెక్కిరింప్ర రాజకుమారినైరులు వచ్చిరి

కాని యొక్కరైన నీవిల్లెక్కువట్టు దిట్టడు గనుపడయ్యె- ఆహా! శిశుపాలా! నీప్రయత్నమును వ్యర్థమయ్యెనా!

దుష్ట—(ప్రవేశించి ప్రకాశముగా) ఓశూరాగ్రేసరులారా! సత్వరరందు మీనయంత్రము భేదింపుడు.

నాగం—(ప్రవేశించి) ఓరేయి! సుబ్బావధాని! వెంకావధాని! తాతంబొట్లు! తప్పకొనుడు. పరశురాముడంతటివాడు మనబ్రాహ్మణ కుల ముద్ధరింపనేటికి యవతరించిన పురుషుని గనుగొంటిమి ఈతడు తప్పక నీయంత్రము గొట్టగలడు.

అర్జును—(మత్స్యయంత్రము గొట్టనరుగుచు తనలో) ఓశ్రీకృష్ణపరమాత్మా! యుష్మత్పదరాజీవములకు నమస్కారము.

[నిష్క్రమించును]

[పాండవులలో తక్కుంగలవారు నాతనివెంట నరుగుదురు]

లంబో—(ప్రవేశించి) నాగంబొట్లు! నాగంబొట్లు! మాట మాట-మనవాడెచ్చట! ఎచ్చట! ఓరీ! వెంకావధాని! నార్ఝూరీచెంబు దర్భాసన, చిత్రాసనము లిటుదెమ్ము. నాగంబొట్లు! నాగంబొట్లు! మనవాడేడి?

నాగం—మనవాడెవరురా!

లంబో—ఇదిగో! ఇదిగో! త్వరగా! త్వరగా! చెప్ప మాయంత్రమును గొట్టనేగినవాడు మనవాడేరా!

నాగం—పప్పునాశించు బోడిబాపలలో నెట్టిశూరుడు పుట్టినవాడో!

లంబో—అటువెడలి చూతెము రమ్ము రమ్ము.

నాగం—అట్లరుగుదము రమ్ము.

[ఇరువురు నిష్క్రమింతురు]

కృష్ణు—ఏమి? ఈబాపలవాడావిడి అన్నా! ఈభూసురోత్తమునిజూచితివా!

బల—తమ్ముడా! ఆతనిముఖమున రాజచిహ్నములు గానిపించుచున్నవి

[తెరలో— బ్రాహ్మణవిజయము—బ్రాహ్మణవిజయము.
కరతాళధ్వనులు వినబడును.]

బల—తమ్ముడా! ఎంత విచిత్ర మాభూసురకిశోరుడు దాయంత్రమీనమును భేదించినాడుగదా!

[తెరలో]

ఓధరణీశ్వరపుంగవులారా! రక్షు! రక్షు! దండువెడలుదు.

గీ. మనలనందర రక్షించి ॥ మనుజవిభుడు
కూతు భూసురునకునీయ ॥ కౌతుకమున
నుండినట్టుల వింటిని ॥ దండువెడలి
వానిదుండిగ మడప దీ ॥ వలయురందు

కృష్ణు—అన్నా! ఇందు విచిత్రమేమున్నది?

గీ. పటుతిమిరపటల ॥ మెడబాపశక్తి
తరణికినిగాక మిణుగు ॥ పురుపునకౌనొ?
యంత్రమీనము గొట్టగ ॥ నర్జునునకు
దక్క నన్యులు భేదింప ॥ తరమె చూడ

బల—సోదరా! నీవచనంబునగల యర్థము విచిత్రము భూసురుండు మీనయంత్రము గొట్టిన నర్జునునకుగాని యన్యుల దరముగాదంటివి అది నిక్కము లక్కయింటి వారలు గతాసులైరని యిదివరకే వినియుంటిమి? నాకు నిది బాగుగా జెప్పుము

కృష్ణు—అగ్రజా! నాపలుకుల నిగూఢమైనయర్థమేమిగలదు!

[తెరలో]

ఓహో భూసురోత్తమా ఈనృపనందనులనుండి ననురక్షింపుము! రక్షింపుము!

కృష్ణు—అన్నా! నీకు పాండునందనులవార్త దెల్పెద. నటురమ్ము శిశుపాలకర్ణదుర్యోధనాదులు ద్రుపదునిపై దాడిచనిరి

బల—తమ్ముడా! వారెన్నడును దుండిగముల సల్పువారలె అయ్యదిపాండునందనులు సజీవులనిన పలుకులవలన దెలియుచున్నది ఏమీ! నేడెంతసుదినము

కృష్ణు—(రహస్యంబున) అల్లదె వారలగనుము పోరెంతఘోరముగా జరుగుచున్నదో చూచితివా?

సీ. పెనువిల్లుచేదాల్చి ॥ పెనగి శత్రులనని
తరుము వాడేసుమ్ము ॥ హరిసుతుండు
వానిదాపున బెను ॥ మ్రాను చేదాల్చి
వరలువాడేసుమ్ము ॥ వాయుసుతుడు
నరుడు యంత్రముగొట్టు ॥ తరి నరిగిన యట్టి
గౌరవర్ణుడెసుమ్ము ॥ కాలసుతుడు
అన్నయేగిన వెంట ॥ నరిన యిర్వురు
కంగువులేసుమ్ము ॥ కవలులెన్న

గీ. లక్కయింటను బ్రతికిరి ॥ నిక్కువంబు
దానినంతయు జెల్పెద ॥ ధర్మరతుల
కేడనైననుగల్గునే ॥ కీడుచూడ
రమ్యగుణగణ గేయ యో ॥ రౌహిణేయ

బల—ఆహా! ఏమి! మనభాగ్యము మేనత్తకొమరులగనుగొంటిమి తమ్ముడా వారలదరికేగుదము. రమ్ము

కృష్ణు—అన్నా! వారలతో నిటప్రసంగింపరాదు సమయముదెల్పెద రమ్ము [ఇరువురునిష్క్రమింతురు]

—*—

## తృతీయ రంగము



రంగము - గృహము

(ప్రవేశము - కుంతి)

కుంతి—(తనలో) కుమారులింకను రారైరి.

సీ. ఉత్సవంబునుజూడ నోత్సుకులై చని
ఇంతదనుకను రారు హేతువేమొ
కౌరవులో క్రూరులై క్రౌర్యంబుతో బట్టి
చంపిరో కటకటా! జాడలేదు
కడుఁబ్రొద్దుమించెనా కొడుకుల గననైతి
నెట్టులదాళుదు నీక్షణంబు
పుత్రులరక్షించు బున్యాత్ములొక్కరైన
గల్గకుందురె? నాదు కర్మమెటులుండె.

ఆ. వె. లుండెనొకడ! చింత గందుమీరుచునుా
వేగఁగావరెనను వేల్పులారా!
సూర్యచంద్రులార సుజనసంఘములార!
సుతులఁజూపరారె సుమతులార!

అయ్యో! నేనేమిసేయుదు. నాకుమారులెన్నడు నింతితడ వోనర్చియుండలేదు. ఏదియో విపరీతముగల్గియుండవలయును. వామనయన మదురుచున్నది. అయ్యది శుభశూచకమని పెద్దలనెదరు. ఆశుభశూచకమెద్దియో ప్రత్యక్షప్రమాణగాఁ గన్పట్టుచున్నది.

ఆ. వె. సుతులుబిచ్చమెత్తు మోసుకులెంతో బొట్ట
నించుకొనుచు సంచ రించుచుంట

శుభము రీతిగాక । శుభము వేరుండునే
భాగ్యహీనురాల । బ్రతికియుంట.

కష్టములు కలకాలముండవని పెద్దలనెదరు. అట్టిది మాకు గలుగునా?

ఉ. ఉడుగని వైభవంబున శు । భోన్నతి రాజ్యము నేలజాలు నా
కొడుకులు బిచ్చమెత్తుచును । గ్రుమ్మరుచుండిరి ధర్మబద్ధులై
సడలనికష్టములుడిచి । సంతత మీగతినుండ భద్రమే
గడియకునైన వచ్చునె? సు । ఖంబొనగూడునె? చింతదీరునే!

[పాండవులు ప్రవేశింతురు]

**పాండ**—తల్లీ! నమస్కారములు.

**కుంతి**—(సంతసముతో) కుమారులారా! ఆచంద్రార్కము సద్యశోభాసులరై వర్ధిల్లుడు. మీరింతదనుక రాకుంకుట నామనంబు దుఃఖసాగరమున మునుగుచున్నయది నేత్రోత్సవముగ మిమ్ములఁ జూడగలిగితి.

**అర్జు**—తల్లీ! నీకు విచారమేల?

ఆ. వె. ధర్మవర్తనమున । దనరు మమ్ముల గాసి
వెట్టజూచునేడు । వెట్టియున్న
కాలువీడువారి । గనిఁజేయకుందుమే
నీదుదీవనమ్ము । నిష్ఫలంబె?

**భీమ**—అమ్మా! తమ్ముఁడు నడిపిన నుడువులు నిక్కము ధర్మవర్తనుఁడైన ధర్మసూతి సోదరులకెయ్యెడ విజయంబుగాకుండు. నీ కట్టి విచారము వలదు. శుభమొనకూడె.

గీ. అస్త్రకౌశలమున జగ । మద్భుతంబు
నొంద పరులెదలందున । గుందుచుండ

ఫలము నొక్కటి దెచ్చె ఫల్గునుండు
తల్లి! నీదీవన తలంప తథ్యమయ్యె.

కుంతి—(సంతోషముతో) మదీయతపఃఫలజనితులారా! ఫల్గునుఁడు దెచ్చిన ఫలము మీరేవురు ననుభవింప నుపయోగించుకొనుఁడు. (నలుతట్టుల బరికించి) నాయనా! ధర్మరాజా! తటిల్లతాంకురసంకాశధగద్ధగాయమానయగుచు నా మ్రోలనిలిచియున్న యన్నులమిన్న యెవ్వరిచిన్నది? ఇటకు రాగతంబేమి?

ధర్మ—జననీ! ఫల్గునుఁడు దెచ్చిన ఫలమాయన్నులమిన్నయే. ఆమె ద్రుపదమహాకాంతునిసుత. ఈ పరిణయార్థమై తగువరునన్వేషించుటకు దగినయుపాయ మొకమత్స్యయంత్రమును ద్రుపదుఁడు కల్పించి యాయంత్రము గగనతలంబున గ్రాలఁజేసి యేవీరుఁడు పంచశరంబుల వీక్షణాలక్ష్యము గ్రిందగల దర్పణమునఁ గాంచి యంత్రముభేదించునో యాఘనునకు దనసుత నిచ్చెదనని స్వయంవరంబు జాటింప దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణ, జరాసంధ చైద్యాదులు ధరావరు లరుదెంచి యంత్రభేదనము దుస్సాధ్యమగుటచే నిష్ఫలతనొంది వగచుచున్న మాఫల్గునుఁడు సునాయాసంబున నాయంత్రభేదనంబొనరించి ద్రుపదుని నెదిరింప వచ్చిన కర్ణ, జరాసంధ, చైద్యాదుల, నాలంబున బారద్రోలి తెచ్చినఫలమే యా పూఁబోఁడి దీని నెఱుఁగక మున్మున్ మీరందఱు సమముగా బంచుకొనుఁడని మాటలాడితివిగదా! అది యెట్టిధర్మము?

కుంతి—ధర్మనందనా! నేనెంతపొరబడితిని? ఫలంబనిన నేదియోయని మీరేవురనుభవించుఁడని యంటిని. నాపలుకు లనృతములగునా? (ఆలోచించి) అర్జునా! నీచేత గెలువఁబడిన నాకన్నియ వీతిహోత్రసాన్నిధ్యమున పాణిగ్రహణమొనర్పుము

సహ—సోదరులారా ! జటాజనచరధారియై యొకమహర్షిసత్తముఁ డీమోల చనుదెంచుచుండె.

ధర్మ—(పరికించి) ఆమహానీయుఁడు వేదవ్యాసుఁడై యుండవలయు.

అర్జు—(పరికించి) నాకు నట్టులే దోచుచున్నయది.

భీము—అట్లైన మాతవాక్కులగల ధర్మము నిశ్సందేహముకాగలదు.

కుంతి—కుమారులారా! ఋషిసత్తముఁడిట కరుదెంచుచుండె. నేనామ రుగుతావున కరిగెద. ధర్మాధర్మముల బాగుగా నమ్మునినడిగి తెలిసికొను టుచితము. [నిష్క్రమించును]

[వ్యాసుఁడు ప్రవేశము]

అందరు—మునివర్యా! వందనములు.

వ్యాసు—పాండునందనులారా! కల్యాణప్రాప్తిరస్తు.

అర్జు—మునిచంద్రా! యుష్మదాగమనం బస్మదీయసంకోచగాఢతిమిరము నకు సూర్యోదయనిభంబయ్యె. మేమందరము ధన్యులము.

వ్యాసు—విజయా! నీవిజయంబువిని సంతోషకలితమానసుఁడనైతి నీకుగల సంకోచ మెద్దికలదు?

అర్జు—నేనొకఫలము దెచ్చితినని వృకోదరుండు జననికెరిగింప నాసాధ్వి మీరేవురు ననుభవించుడనియె. వృత్తాంతంబంతయు నెఱింగి వీతిహోత్రునిసాక్షిగా నన్నే పాంచాలి వివాహమాడవల సినదిగా మాతజెప్పియుండె. అది యెట్లొనసమ్మతంబగును. అగ్ర జులిర్వురుండ నేనిప్విధి పరిణయమాడుట ధర్మమెట్లగునే!

వ్యాసు—ఫల్గునా! నీవిందుకై యోచించు టుచితముకాదు

గీ. తలప నీతల్లివాక్కుల ధర్మమగునె?
చంద్రసూర్యులుగతిదప్పి సంచరింప
నున్న జుక్కలు తప్పిన గాని
సంతతామర సన్నుత సాధ్విగాని.

మీరేవురు బరిణయమాడుటయే యుక్తము.

నకులుడు—(తనలో) ఈఋషిసత్తముని వాక్కు లద్భుతముగానున్నవి.

[తెరలో]

కుమారులారా! ఋషిసత్తముని యనుమతి యవ్యశ్య మాచరింపవలయు

భీము—(తనలో) తల్లిగారియనుమతి నీఋషిసత్తము డంగీకరించె ఇది యెట్టుల ధర్మమగును? ఏవ్వర కొకసతియా?

[తెరలో]

గీ. సగముదేహంబు పాలిటికి గ గాంధర్వుండు
కన్న దేవకీగర్భము గ నాంబు
దనుజసంతతి మదరిగ దంచినట్టి
కృష్ణుఁగంటిమి భవతాప గతృష్ణదీర!

ఓహో! మనభాగ్య మేమనవచ్చు ఆర్తత్రాణపరాయణుఁడైన నారాయణావతారుఁడే శ్రీకృష్ణుఁడే. అవ్వలనున్న హలాయుధధారి యాతనియగ్రజుఁడు బలరాముఁడు

ధర్మ—సోదరులారా! ఆపలుకుల వింటిరా! మేనమఱది శ్రీకృష్ణుఁడు వచ్చుచున్నాఁడట

భీమ, అర్జున, నకుల, సహ—ఏమి! మనభాగ్యము స్వయంవరమునఁ జూడవచ్చి మనజాడఁ గనుగొని యాపరాత్పరుఁడగ్రజసహితుఁడై యిట కరుదెంచుచుండనోపు

వ్యాసు—భగవానుఁడగు శ్రీకృష్ణుని దర్శింప నెదురేగుదము రండు

అందరు—(ఎదురునడతురు)

సహ—

గీ. బర్హిపించంబుల శిరమున గంధపిల్లి
అది ఘనచ్ఛాయాంతరో నవఘనాంగ

మనలగాంచగ నిదె వచ్చె ॥ మాన్యచరితు
డమరవినుతుఁ శ్రీకృష్ణుఁ ॥ డన్నలార
[బలరామశ్రీకృష్ణులు ప్రవేశింతురు]

కృష్ణు—మునిసత్తమా! వందనములు ధర్మనందనా! నమస్కారములు

వ్యాసు—కల్యాణప్రాప్తిరస్తు

ధర్మ—శ్రీకృష్ణుని కౌగలించుకొని ఓయదువంశరత్నాకరరాకాసుధాకరా! భద్రప్రాప్తిరస్తు మీరాక మా కమందముదంబొనగూర్చె

భీమ, అర్జున, నకుల, సహ—మేనమామలారా! వందనములు.

బల, శ్రీకృ—శీఘ్రమే వివాహప్రాప్తిరస్తు

శ్రీకృ—మునివర్యా! తాపసులు నిరాటంకంబుగ యజ్ఞయాగంబులు సల్పుచుంటిరిగదా!

వ్యాసు—మహానుభావా! యుష్మత్కారుణాకటాక్షమున మునులు యజ్ఞయాగంబుల నిర్విఘ్నంబుగాఁ జేయుచుండిరి

బల—అటులైన లోకంబులకిక వెగ్గికొదువ పాండునందనులారా! స్వాతివర్షమున కెదురుచూచు ముత్యపుచిప్పలభంగి మానేత్రంబులింతవఱకు మిమ్ములజూడ నుత్సాహమునొందినవి. కనులారా మిమ్ముల గంటిమి.

శ్రీకృ—మునిసత్తమా! కౌరవులు పాండునందనుల నెన్నియిక్కట్టుల నలయింపనెంచిరి.

వ్యాసు—మహాశయా! కౌరవుల గష్టములు కొట్టువెచి సంతనే ధర్మవర్తనులకు కీడువాటిల్లునా! అయ్యది సర్వజ్ఞులగు మీకే యెఱుక.

బల—పాండునందనులారా! స్వయంవరమున మిమ్ముల గుర్తించి యూతివచ్చితిమి

ఆ. వె. సత్యధర్మరతులు ॥ సజ్జనవినుతులు
ముజ్జగంబులేలు ॥ భూబలులు

పాండుకుమారులార ! పరికింపఁగల్గితి
విప్రరూపులగుచు ! వెలయుమిమ్ము

అర్జునా! నీవిజయంబుగని మిగుల సంతోసమొందితి కష్టములు కల కాలముండునా?

కృష్ణ—అగ్రజా! కౌరవ కైతవాగ్నిశలభంబులగతి మ్రగ్గక నా కైతము వెలకాని యాబాధనుండి తప్పించుకొని యీగతి బడబవేషధారులైయునేక యిక్కట్టుల గుడుచుచుండిరి సుఖమొనగూడినపిదప నాకష్టములు కలలఁతిగా కుండునా

భీము—బావా! బలరామా! విప్రరూపసంచారులగు మమ్ము స్వయంవరంబున నెట్టులగుర్తింపఁగల్గిరి.

శ్రీకృ—భీమసేనా!

గీ. జలదసమితో సూర్యునిఁగప్పి ! జగము వెలుగు
బాసి గాఢతిమిరమునన్ ! వరలునగునె
నిప్పురూపమున్ మాఱి ! వెలుగుచున్న
తేజమును దాఁపఁగలరె వి ! భ్రాజవర్య!

బల—అయ్యది నిక్కము విప్రవేషముల వేసినంతమాత్రమున క్షత్రియ తేజముడుగునా?

వ్యాసు—మణిపూసకు మసిపాతఁజుట్టినను సహజకాంతి పోవునా?

[తెరలో]

మేము సామంతాధిపులము! ముష్కరుని వాంఛానికుంజము ఫలించినది బాడబవేషధారి పంచకమా పాండవపంచకమని యిపుడు వీరలు మాటలాడు పలుకులవలన తెలియవచ్చినది భళీ! సేవకులారా! రండు. మదీయజనకున కీసంగతి నెఱింగించి పరిణయమునకు వీరిని దోడ్కొనిపోవుదము

వ్యాసు—ఓహో! పాండునందనులారా! మిమ్ములను బాడబులనినమ్మిన

ద్రుపదపుత్రుండు గుర్తెఱిగి తనతండ్రిని దోడ్కొనివచ్చి వివాహ మునకు మిమ్ముల దోడ్కొనిపోవు.

శ్రీకృ—ధర్మరాజా! భీమార్జుననకులసహదేవులారా! మేనత్తయగు కుంతిని దర్శింపనేగెద-మీరునురండు.

పాండవు—చిత్తము.

వ్యాసు—బలరామకృష్ణులారా! పాండునందనులారా! నేనా ద్రుపదపురంబునకరిగి మీజనని వాక్యములు నచల వాక్యోమువ్చటించి యాసాధ్వివచనక్రమము నెరవేర్ప ధర్మశాస్త్రము జూపి చెప్పెద.

ధర్మ—చిత్తము. [అందఱు నిష్క్రమింతురు]



చతుర్థరంగము

పురిదేశము-పురవీధి.

[ప్రవేశము - నాగంబొట్లు]

నాగం—(తనలో) ద్రుపదుని యదృష్ట మేమనవచ్చు? లాక్షాగృహంబున బాండవులు మృతినొందిరను వార్త వినంబడినంతమాత్రమున గోలుగోలున నేడ్చిన ప్రజలపుణ్య మేమనవచ్చు? పాతివ్రతనోము ఫల మెంతయనవచ్చు- కాకున్న సకలభాగ్యశాలురగువారు మేటులు- సదాధారులు- సురుసుతధర్మసంచారులు- పాండునృపనందనులు సజీవులైయుండిరను నామనంబు చంద్రోదయమునందలి శరనిధి చందంబున నుప్పొంగుచున్నయది. ద్రుపదమహారాజెంతటి యోచన మొనరించె. పాండవమధ్యమునకీయనెంచిన తనసుతకు బాండవులు మృతినొందిరను విధానవార్తవిని మనంబునమ్మక ధన్వికిందక్క సమ్యగ్లక్ష్యమగు మత్స్యయంత్రభేదనమును గల్పించి కృతార్థుడయ్యె. ఏమినా మందబుద్ధి నన్నుమనుకు బాపలయింట

పాంచాలి, పాండవులు—(వ్యాసాధి, పెద్దలకు నమస్కరింతురు)

వ్యాసు—ఆయురారోగ్యైశ్వర్యప్రాప్తిరస్తు ద్రుపదమహారాజునకు నమస్కరింపుడు

[పాండవులు,పాంచాలియు ద్రుపదునకుమ్రొక్కుదురు]

ద్రుప—శ్రీఘ్రమే ధనకనకవస్తువాహనాద్యైశ్వర్యాయురారోగ్యప్రాప్తిరస్తు అమ్మా! పాంచాలీ

ఆ. వె. పాండునందనులను ॥ పతులుగా బరసితి
వమ్మ నీదుభాగ్య ॥ మదియెసుమ్మ
ఇమ్మునీశ్వరు డిట ॥ నెలమి జెప్పినట్టి
పతుల బూజసల్పు ॥ మతిముదమున

పాండునందనులారా! నాపుణ్యంబున మీరు నాకుజామాతలై వర్తిల్లితిరి నాజన్మము సార్థకమయ్యె పరాత్పరుండగు శ్రీకృష్ణుండు మీమూలమున బాంధవుండయ్యె ఇదియంతయు నాయదృష్టము

శ్రీకృష్ణు—

ఆ. వె. పాండుసుతులు సాధ్వి ॥ పాంచాలితో గూడి
యమితకీర్తిగాంచి ॥ యలరుగాత!
హితులుబుధులుబుధ ॥ తతులుపొగడగ నా
చంద్రతారకముగ ॥ సంతతంబు

వ్యాసు—తథాస్తు

[మంగళహారతి]

సమాప్తము





శ్రీదక్షిణామూర్తయేనమః

# పాంచాలీపరిణయము



## అనుబంధము.

—*—

### ప్రార్థన.

జంఝూటి — చతురశ్రగతి.

శ్రీ- వ- గా! శ్రీవగా! సుధీవరా!
దేవ దేవ గా! దివ్యనీవెగా! ॥శ్రీ॥
స్థావరజంగిము - సంచయవాసా
పావననామా - భక్తసంతోషా ॥శ్రీ॥

### మంగళపాలుము.

గౌళ — ఏకతాళము.

ఓపరంధామా! — ఓసురనుతనామా!
కాపాడగరమ్మా! — కౌంతేయుల వినమా ॥ఓ॥
పాపమనక శీలాత్మా — భవనంబున వారల జంప

పాపి సుయోధను - భావము; ఎటుగా చెదవోయని
నాపరితా - పము వినుత
సచ్చరితా - భూనేతా ॥పా॥

ధృ తి రా ష్ట్రు డు
హిం॥ తోడి — ఏకతాళము

సుగుణగేయులారా! । సూనృతధర్మవ్రతులార!
అగణితసచ్చరితులార! — అవనినన్నువీడితిరా!
పగబూనినట్లు మిత్తి —భవ్యులగుమిముమ్రింగెన?
రగిలెదీపమునామదినో — వగబాంధుపుత్రులార!

హి డిం బు డు
ఇంగ్లీసునోటు — ఏకతాళము
(ఫైలాగ్)

భుజబలమునుగాంచు- మీా-
పోరాటమందు నిన్
నిజముగ నేనోంచెదన్ । నిను దృటిలోఁ ద్రుంచెదన్
అజ రుద్రులకష్టపడిన । ననిసీవుండవు సీచుడ!
భీము—అనిలో నిను గడతేర్చెద । పథులలోకములకు సుఖముగూర్చెద
కననాకోపముదీరన్ । మునిజనములచింతలారగ
అనుమానమేల? ? నంతకనగూళి
అంతకునిపొల్లి । కంపెదరారా!
హిండిం—చులకనపలుకులు । పలుకకుపోరా!
భీము—నిలునిలు కలనున । నిను గడదేర్చెద
హిండిం—జాలమేలరా? సమరము జేయుగ

భీము—పాలుమాలికటు | పలుకకపోరా

హిడిం—మన లేవటరా?

భీము—కన గొన మేరార?

హిడింబి.

బేహాగ్ - ఏకతాళము

ఔరా! యోధూరా! - అబలల వేచెద వేగా!
శూరాగ్రాత్ముడవీవౌరా - సారసాంబకా తగదు తగదా ||ఔ||
నీరజనేత్రుడు నిన్ననంగునిక - మీరఁ జేసి నగతి మఱచితివా
మేరమీఱగ నీపోగరడంచెద - సారయశోబలు డిభీమునిగూడి.

మోహనం — రూపకము

(ధ్రువా)

ధర్మ—ఎంతచింత సుయోధను - డెంచెమనల బాధించ||
వింతకదా - పంతముదా - కౌంతేయుదా - నెంచెగదా||
భీము—తెలిసెనా యిప్పుడైన - కౌరవు లొనరించుకృత్య||
ఖలులనగా - నొప్పవుగా - కంటివిగా - ఇటులాగుట || తె||

పరిజనులు.

హిం. ముఖారి - ఏకతాళము.

పాండుపుత్రులారా! - భవ్యగుణములారా!
పాపులమగు మిమువీడి - పరము జేరినాగా||
ఏపాపంబెరుగని మి - మ్మీగతి నెవ్వరు చేసిరో
కాపాడినవారు లేర? ఘనులగు - మిము గాదుమా||

ద్రోణుడు

దర్బారు — రూపకము

ఫల్గుణా నిన్నుగని - బహుముదమందితిరా
అల్లువిద్దెల నాకడ - నభ్యసించి యశముగొంటివి
శ్రీశ్రీ—గురునిపేరు నిలిపెదవని - కోర్కెనుంటి నదియెల్ల
శరధిబడియె నీవుమడియ - సంశయమింకేలనురా!

భీష్ముడు

ముఖారి — ఏకతాళము

పౌత్రులారా! భవ్యులార - పాండుపుత్రులార!
పరమపదవి జేసితిరా - ధరణి తాతపడనాడి
ఏల? జన్మమేల? జీవ - మేలసర్వ మీరేగిన
కాలానలమందుబడిన - జాలునింక నాదన వా!

విదురుడు

జంఝూటి — ఏకతాళము

కుమరుని - దుర్నయపునడత
కూడదనుచు - జెప్పలేని
కుచ్ఛితుడవు కౌంతేయులు - కువలయ మేలగనుంటివ
సత్యవ్రతుడ వైయైన నీ - సరణి ముందుగాంచెదగా
సత్యసంధులు కౌంతేయుల - జంపనేరివశముగా!

దుర్యోధనుడు

దర్బారు — రూపకము

పితులారా! నామదిగల - కుతుక మేమని యెదనో
అతులిత వెరులు మడసి రనగ - నింక సంశయగిదా

# పాంచాలీ పరిణయము

## ద్రౌపది.

ముఖారి — ఏకతాళము.

కా- వ- రా- వే

పావనచరితా - భక్తసంత్రాతా॥
పాండుపుత్రకులు - లాక్షాభవనంబున మడసిన
చండానల జ్వాలామాలల - సరగున నేనిక మృతినొందగ॥

## ధృపదుడు.

సారంగ — ఏకతాళము.

అయ్యో కౌంతేయులారా!
అన్యాయముగ - మృతిగంటిరా॥
నెయ్యంబున మీపై - యాసనేనుంటి నదిరిక్తమ॥
కడుదుర్నయుడా సుయోధనున్ని- కనులుచల్లబడెనే మోయిప్పుడు॥

## ద్రౌపతి.

ఇంగ్లీషునోటు — ఏకతాళము

పోయెనగదహా నాపతి - పూర్ణవయసురిక్తముగా॥పో॥
హాసురలారా! హా తేరులారా? అబలగావరారె?
ఎక్కడనా వెత్తి యాసలెన్నటైన - జిక్కగలదె?
అక్కసమున సురలారా! - అర్జునునకుగూర్పరా!

## భ్రమరిక

ఇంగ్లీషునోటు — ఏకతాళము

తాలిమిదాల్పుము - తరణిమనంబున
నేలనిట్టివగ? - మేలగురమ్మా
నీమనోహారుని - నీవుజూచెదవు

వేమరునీవిటు - వెట్టివడెద వి
డేల - బాల - మేల - చాలు ॥తా॥

అర్జనుడు
కారువ — ఏకతాళము

ఈశా - సర్వేశా - ఇపుడిట్టుల మముమార్చితివా
అఖిలభూ - భువనమంతయు నేలగ
నంతటి బలయుతుల - మైనను మేమిటు
సుఖమును విడచి భూ - సురులమగుచు
నొరది బిక్షకులమై ధర - దిరుగవలసె దయ
గనుమా! యనుమా! - ననుమా! ననుమా!

కుంతి
ముఖారి — ఏకతాళము

ఏలనాతనయులు నే - డింకనురాకుండిరిగా
ఏలబ్రతికియుంటి సుతు - లిట్టుల బిక్షములైయుండిరి
ధరణినేల జాలెడునాదగు - తనయులు రాజ్యవిహీనత
భరియింపగ జేసినవిధి - కరుణజూడడాయెనయొ్య!

(డైలాగ్)

ధర్మ—తల్లినీవిటు తమ్మునట్టుల - ధర్మమగునే బంపగ
బల్లిదుండాతని యుండ - బ్రతుకవాంఛనుంటిమి
కుంతి—పరుల కుపకారంబు - సలుప బంపియుంటినిపుత్రికా
ఉరుబలుండాభీముడ - య్యసురుజంపివచ్చుగా
ధర్మ—ఉరుబలుండని - యెరింగియుండియు
నరయకెట్టుల బంపితో
కుంతి—సరగునను - భీముడసునచ్చును సంశయింపకుధర్మజా!

### వ్యాసుఁడు

బేహాగ్ — ఏకతాళము

నీమహిమలెన్నదరమా - దీరజోద్భవాదివిబుధు
లకైన జుమవర ॥నీ॥
పాహిమాం - పాహిమాం - పాహిమాం - పాహిమాం॥
అఖిలజగములకు - నాధారుఁడవుగద
అనాధినాధను - తామరయూఘ సుబోధ॥

### కర్ణుఁడు

బేహాగ్ — ఏకతాళము

యంత్రిమానములలో న - న్యాలు కోటులుదరమా
మిత్రమా! బుధస్తోత్రపాత్రమా! - నాకునకు-
శక్తి యెంతయున్న గాని - సభలోన స్త్రీ కోరితేనను చు
సైచియుంటి నింతదనుక - శక్తి జూపు మనసను
నేడు - జయముకూడు॥యం॥



